

*Chandamama* *Photo — N. Ramakrishna*

బలవంతపు బ్రాహ్మణార్థము




అమ్మా

బాలపాపల ఆరోగ్యం పరిశుభ్రమైన భోజనముమీద ఆధారపడి వుంటుంది. ఇండియా సిరామిల్స్ వారి పింగాణి వస్తువులు అందముగావుండి. తినే పదార్థములు పరిశుభ్రతగావుంటయ్ నిత్యము వాడుకచెయ్యి.



## ఇండియా సిరామిక్స్ లిమిటెడ్
## నెల్లూరు :: కాళహస్తి :: మద్రాసు

---

# ఉమా బ్రాండ్ ఆభరణములు

అమూల్య లోహముపై అసలు బంగారు రేకు అంటించి తయారుచేసిన ఆభరణములు

Rs. 2-0-0 340



UMA 620



UMA 621



UMA 625



UMA 622

Rs, 2 12 0

ప్రతి వస్తువు మీద **UMA** ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలయును.

10 సంవత్సరములు గ్యారంటీ

600 రకములుగల కేట్లాగు ఉచితము. నేడే వ్రాయండి.

ఉమాగోల్డ్ కవరింగ్ వర్క్సు, ఉమామహల్

ఉమా గోల్డ్ కవరింగ్ వర్క్సు P.O.

మచిలీపట్టణము.

పిల్లలకు

# చందమామ

పెద్దలకు

# ఆంధ్రజ్యోతి

నేడే చందాదారుగాచేరండి

సా॥లు చందా **5-8-0**



ఆఫీసు

37 ఆచారప్పన్ వీధి - మద్రాసు 1

---

# యువ

యువకుల మాసపత్రిక

ఇందులో బి. యే.; ఇంటరు; స్కూలుఫైనలు చదువు విద్యార్థుల రచనలు ప్రకటిస్తాము. ఈ విషయంలో తమ తమ రచనలు పంపి తోడ్పడమని ప్రతి విద్యార్థినీ కోరుతున్నాము. ఇవికాక బి. యే, ఇంటరు, స్కూలుఫైనలు కోర్సుకుసంబంధించిన వ్యాసాలు, ఉంటాయి.

అధ్యాపకులు సహకారం అర్థిస్తున్నాము.

సంవత్సరం చందా రు. **5-0-0** విడి ప్రతి **0-6-0**

సంచిక సెప్టంబరులో వెలువడుతుంది.

యువ కార్యాలయం

37, ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు 1.



## చదువుకోండి



ఇంకా, ఇంకా, ఎన్నో!

---


సాలు చందా 5-0-0

# చందమామ

విడిప్రతి 0-6-0

పిల్లల మాసపత్రిక


చందమామలో పిల్లల రచనలూ, పిల్లల ఫొటోలూ ప్రకటిస్తాము. చక్కని ఫొటోలు కార్డు సైజులో తీయించి 0-0-9 బిళ్ళతో పంపాలి. ఫొటో ప్రకటిస్తే ఉంచుకుంటాము. లేకపోతే తిప్పిపంపుతాము. అచ్చుపడని రచనలు తిరిగి కావాలంటే కవరుమీద తమ అడ్రసు రాసుకుని బిళ్ళ అంటించి, వ్యాసంతోపాటే మాకు పంపాలి. లేకపోతే మేము తిప్పి పంపలేము. ఉత్తర ప్రత్యుత్తరాలు పెంచి లాభముండదు. ఈ విషయాలు ముఖ్యంగా గమనించి మాకు సహాయపడమని మా ప్రార్థన.


ఆఫీసు :

37, అచారప్పన్ వీధి : మద్రాసు 1




సంచాలన: చక్రపాణి

సంపుటి 1 | 1 ఆగస్టు 1947 | సంచిక 2

## తెలుగు పాపలారా!

మీరు నన్నుచూసి సంతోషాన్ని వెలిబుచ్చుతూ వ్రాసిన జాబులన్నీ నాకు చేరినవి. మీకు ఇవే నా దీవెనలు. ఇకముందుకూడా మీకు ఇంతకంటె అంద చందాలతో, గమ్మత్తు గమ్మత్తు కబుర్లు చెప్పుతూ కనిపిస్తాను. సరేనా!

చూడండి, చందమామ ఏఒక్క జాతికీ ఏఒక్క వ్యక్తికీ మాత్రమే మామకాదు. హిందూదేశంలో అన్ని జాతులకూ, అందరికీ మామే. అందుచేత నేను అరవం, కన్నడం, మళయాళం, హిందీ మొదలైన అన్ని భాషలలోవచ్చి అందరికీ కనిపించాలని అనుకుంటున్నాను. మీరేమంటారు?



# నా ఆత్మ కథ

**చందమామ**

"అమ్మా అమ్మా! చందమామ పట్టి అల్లరివాడే. ఎప్పుడూ చొక్కా అన్నా తొడుక్కోడు. నేను చూడు ఎలా తొడుక్కున్నానో" అని మీ అమ్మతో నామీద చాడీలు చెబుతుంటారు. నిజమేనా? నేను ఎందుకు తొడుక్కోనో ఎప్పుడన్నా ఆలోచించారూ? దీనికి వొక పెద్ద భారతం ఉంది. మా అమ్మ మొన్నటిదాకా చెబుతూవుండేది.

నేను పుట్టగానే ఆకాశమంతా వెలుతురుతో నిండిపోయిందట. అది చూచి ఆశ్చర్యపోయి గ్రహాలు వచ్చాయి, చుక్కలు వచ్చాయి. నన్ను అంతా చక్కని తండ్రి అంటే చక్కని తండ్రి అన్నారు.

మంచిరోజు చూచి అశ్వని నాకు చక్కని ఉయ్యాల తెచ్చింది. భరణి అందులో ముత్యాలు వేలాడకట్టింది. కృత్తిక, రోహిణి అనూరాధ, రేవతి దానికి రంగురంగుల మబ్బుతెరలు కట్టారు. ఆతెరలకు వొక అంచున మెరుపు మరొక అంచున ఇంద్రధనుస్సు ఉండేవి.

"చందమామ ఉయ్యాల నేను ఊపాలి అంది" రోహిణి. "కాదు నేను" అంది రేవతి. ఇలా చుక్కలంతా పోట్లాడుకుంటూఉంటే మాఅమ్మ చివరికి రాజీ కుదిర్చింది. దానిప్రకారం వంతులచొప్పున వొక్కొక్కరే వచ్చి జోలపాడుతూ ఉయ్యాల తొట్టినిఊపుతూ ఉండేవారు.

వొకరోజున చలిగాలి బయలుదేరిపోతూ నేను నిద్రపోతూవుంటే వచ్చి సూదులతో గుచ్చినట్టు గుచ్చింది. మీకు అలాంటి మనుషులు తగిలారో లేదో, వాళ్లకి చిన్న పిల్లల్ని ఏడిపిస్తేనే కాని ముద్దు రాదు. నేను వొక్కసారిగా కెవ్వుమన్నాను.

మా అమ్మ గబగబా పరిగెత్తుకొచ్చి, "నా తండ్రిగా, ఏడవకు" అంటూ ఎత్తుకొంది. నా ఏడుపుకు కారణం తెలుసుకొంది. ఆరోజునే ఆకాశంలోని అంగళ్లన్నీ తిరగవేసి చలిదూరని చక్కనిగుడ్డ తెచ్చింది. అది పెట్టి నాకు వక చిన్నకోటు కుట్టి తొడిగింది. ఆకోటు మెత్తగా, హాయిగా, వెచ్చవెచ్చగా ఉంది. ఆ కోటుతోనే ఆ రాత్రి నిద్రపోయాను.

ఇట్లా నిద్రపోయి లేచేటప్పటికి నాకోటు కాస్త చినిగిపోయి ఉంది. వక్కసారి బావురుమన్నాను. మా అమ్మ గబగబా వచ్చి "ఎందుకోయి తండ్రీ ఏడుస్తావు? ఎవరు కొట్టారు?" అని అడిగింది. నేను జరిగింది చెప్పలేకపోయాను. ఉయ్యాల ఊపుతూన్న రోహిణి వట్టి కొంటె కోణంగి. అది ఏమన్నా చేసిందేమోనని కసిరి నన్ను



తన చేతుల్లోకి తీసుకొన్నది. నేను ఏడుస్తూనే చినిగిపోయిన కోటు చూపించాను. మా అమ్మ ఎగాదిగా నా కోటుచూచి "నా బంగరు తండ్రిగా. ఏడవకు. నీకు ఇంకో మంచి కోటు కుట్టి తొడుగుతాగా. ఏడవకు. చాలకుండా కుడితే చినిగింది. ఈతడవ నీకు సరిపోయేటట్టుకుడతానుగా," అంది.

మా అమ్మ మళ్ళీ అంగళ్ళన్నీ తిరిగి మంచి గుడ్డతెచ్చి వొకటికి రెండు సార్లు కొలతలు తీసుకుని కోటుకుట్టి తొడిగింది. ఆకోటు తడువుకొంటూ, రోహిణి జోలపాట వింటూ నిద్రపోయాను. మరునాడు లేచేటప్పటికి ఏమి జరిగిందనుకొన్నారు. బంగారంవంటి కోటు బదాబదలుగా చిరిగి వుంది. మళ్ళీ బావురుమన్నాను.

ఇలా ప్రతిరోజు వొక కొత్తకోటు కుట్టి తొడగటం, మరునాటిప్రొద్దుటికి అది చాలక చిరిగిపోవటం జరిగింది. మా అమ్మ యిట్లా 14 కోట్లు కుట్టింది. 14 కోట్లు చినిగాయి' 15వ కోటు అన్నిటికన్నా పెద్దది. చాల అందంగా ఉంది. అది ఏమైందో తెలుసునా? మరునాటి ప్రొద్దుటికి వట్టి గంగిరెద్దు బొంత అయింది. ఆమర్నాటికి మళ్ళీ నేను చిక్కిపోయాను.

ఇదంతాచూసి మా అమ్మకు విసుగెత్తింది. అప్పటినుంచి మళ్ళీ కోటుకాని చొక్కా కాని కుట్టి తొడగలేదు. ఎవరన్నా నాకు సరిపోయిన కోటు కుట్టిస్తే ఎంతో సంతోషిస్తాను. మీలో ఎవరుచేయగలరాపని?

## వచ్చేశా! — మం. పా. శాస్త్రి

తెల్లన్ని నావెల్గు తీగల్ల తోడ
చల్లన్ని నాకాంతి చమికీల తోడ
మామయ్యా నే చందమామయ్యా నేను.

తెలుగు తోటలలోని కలువపూ దేనె
తెలుగు ఊటలబావి తియ్యన్ని నీరు
తెలుగు పిల్లల్లార! తీసుకొచ్చాను.
తియ్యన్ని ఆనీట తేలిపోదాము
తియ్యన్ని ఆతేనె తిందాము రండి!

చుక్కల్ల తోగూడి చక్కగా ఆడి
మబ్బుల్ల తోగూడి పాడుకుందాము
ఆటల్ల పాటల్ల అలసిపోతేను
చిన్ని పిల్లల్లార! సేదల్లు దేర
పాలవెల్లిపయిని పవ్వళిద్దాము.
తెనుగు పిల్లల్లార! చనుదెండు! రండు!!




కాకులను మనం చాలా అలుసుగా చూస్తాం. "కాకి చిరకాలమున్న నేకార్య మగును?" అనేపద్యం మీరు చదివే వుంటారు. "లోకులు పలుగాకులు" అని సామెత ఒకటిఉన్నది. ఈవిధంగా మనం కాకులను తిడతాం. కాని కాకులు చాలాగొప్పవి. మనకు తెలియని విషయాలు కాకులకు తెలుసు. కాకి గుమ్మం ముందు నిలబడి అరిస్తే మనయింటికి చుట్టాలు వస్తారు. చచ్చిపోయినవాళ్ళ మనస్సుల్లో ఏవైనా తీరని కోరికలుంటే కాకులు పిండాలు ముట్టవు. అప్పుడు మనం చచ్చిపోయినవాళ్ళ కోరికలు తీర్చటానికి ఒప్పుకుంటాం.

కాకులెంత తెలివైనవో తెలుసుకోవాలంటే కాకమ్మ జీవితచరిత్ర చదవాలి.

శ్రావణ మాసంలో ఒక మంగళ వారంనాడు కాకమ్మ గుడ్డులోనుంచి పైకివచ్చి కళ్లుతెరిచింది. కాకమ్మ తల్లి దండ్రులు చాలా ప్రజ్ఞావంతులు. ఎండు పుల్లలూ, చీపురు పుల్లలూ, రకరకాల ఈకెలూ పెట్టి అందంగా గూడు కట్టటం వారికి తెలుసు.

పుట్టినప్పుడు కాకమ్మ ఏమీ అందంగా ఉండేదికాదు. ఈకలులేనివొళ్లూ, బోడితలా, తలకన్న పెద్దముక్కూ, చూస్తే ఎవరికైనా నవ్వొచ్చేది. కాని మనం కాకి పిల్లల్నిచూసి నవ్వరాదు. నవ్వితే వాటి తల్లిదండ్రులకు కోపం వస్తుంది. మనకు అందవికారంగా కనిపించినా, కాకిపిల్ల కాకికిముద్దు. ఆ సంగతి మీకు తెలిసే ఉంటుందికదూ!

కాకమ్మకు ముగ్గురు తోబుట్టువులు, ఇద్దరు అన్నదమ్ములూ ఒక చెల్లెలూ ఉండేవారు. ఇంతమందినీ పెంచుకురావటం కాకమ్మ తల్లిదండ్రులకు ప్రయాసగా ఉండేది. కాకమ్మ తోబుట్టువులలో ఇద్దరు మరీ ఆశాపాతకులు

ఉండేవాళ్లు. తల్లిదండ్రులు తెచ్చిన ఆహారాన్ని అందరికన్న ముందు వాళ్లయిద్దరూ అందిపుచ్చుకుని కాజేసేవారు. మిగతా పిల్లలకిది కష్టంగా ఉండేది. అందరికన్నా వాళ్లకు ముందుగా రెక్కలు వచ్చాయి. ఒకరోజు వాళ్లిద్దరు 'కూ' అని అరిచారు. వాళ్లు కాకులు కారనీ కోయిలలనీ కాకమ్మ నాన్నా అమ్మకూ తెలిసిపోయింది. కాకమ్మ తండ్రి వాటిని కోపంకొద్దీ వెంటబడి తరిమాడు కాని ఆ దుర్మార్గులు చిక్కలేదు. కాకమ్మ తల్లి పెంచిన మోహంచేత వాటిని పోనిమ్మని తన భర్తను శాంతపరిచింది.

కాకిపిల్లలు మెల్లిగా ఎగిరే స్థితికి వచ్చాయి. పక్కనున్న చెట్లమీదికీ ఇంటి కప్పులమీదికీ ఎగరటం అభ్యాసం చేశాయి. కొంతకాలం గడిచాక పిల్లలను తిండివేటకు పట్టుకుపోయే సమయం వచ్చింది. మొదటిరోజు కాకమ్మవంతు. తల్లిదండ్రులవెంట కాకమ్మక్క తిండి వేటకు బయలుదేరింది.

ఒకానొక ఇంటి ఆవరణలో ఒక గండుకుక్క ఉన్నది. రోజూ దాని యజమాని దానికి ఉడకవేసిన ఎముకలు పెడతాడు. ఈరోజున కుక్కకు యజమాని స్వయంగా ఆహారం పెట్టక నౌకరుచేత పెట్టించాడు. అందుకని కుక్క అలిగి నేలమీద పొర్లాడుతున్నది.

కాకమ్మా, వాళ్లఅమ్మా, నాన్నా ఇంటి చూరుమీదినుంచి ఇదంతా చూస్తున్నారు. కాకమ్మ తండ్రి "కా, కా," అని అరిచాడు. కుక్క వాళ్ళకేసి నిర్లక్ష్యంగా చూసింది. కాకమ్మతల్లి "కా, కా, కా," అని అరిచింది. కుక్కకు కోపంవచ్చి మొరిగింది. మళ్ళీ కాకమ్మ తండ్రి అరిచాడు. ఈసారి కుక్క పట్టించుకోలేదు. దానికి కాకులమీద విసుగెత్తింది. ఈ సంగతి గ్రహించి

కాకమ్మతల్లి "కా" అని చిన్నకేక పెట్టి కుమా ర్తెను హెచ్చరించింది. కాకమ్మ రివ్వునవాలి, ఒకఎముక అందుకుని, మళ్ళీవచ్చి తల్లిదండ్రులను చేరుకున్నది. కాకుల కుటుంబం అక్కడినుంచి కదిలి బండరాముడుగా రింటికి చేరుకున్నాయి.

కాకమ్మ తల్లిదండ్రులు బండరాముణ్ణి బాగా ఎరుగుదురు. వాడిదగ్గిరవాళ్లు ఎన్నో అప్పచ్చులు కాజేశారు. వాణ్ణి ఎన్నిసార్లో ఏడిపించారు. బండ రాముడి అమ్మమ్మ చాలా ఆచారవంతురాలు. వాళ్ళింటో మాంసం వండుకోరు.

ఆవాళ రాముడు వాళ్ల ఇంటిపంచలో తప్ప అన్నం తిననని మొండికేశాడు. వాళ్ల అవ్వ పళ్లెంలో అన్నం పెట్టుకుని మనమడికి వడ్డించ టానికి వంటయింటినించి వస్తున్నది. ఆవిడను చూసి బెదిరి కాకమ్మ నోట్లో ఉన్న ఎముక కాస్తా జారవిడిచింది. అది ఖర్మంచాలక అవ్వ చేతిలో ఉన్న అన్నం పళ్లెంలో పడింది.

"ఈ కాకులు పడిచావా! కంచెడు అన్నం గంజిగుంటలో పొయ్యాలిసి వచ్చిందే!" అని అవ్వ తిట్టుకున్నది.

అవ్వ చాలాచెడ్డది. అసలే రేషను రోజులు గదా, అటువంటప్పుడు వృధాగా అన్నం పారే స్తారా? పోనీ పారేసేది ఏ కాకులకో వెయ్యక గంజిగుంటలో పారేస్తారా? ఎముకలంటే అవ్వకు అంత లోకువా?

అవ్వ వెళ్ళిపోతుండగా కాకమ్మ తండ్రికి గారెల వాసన కొట్టింది. వంట యింట్లో గారెలు వండుతున్నది అవ్వ. కాకమ్మ వంటింటోకి జొరబడి ఒక గారె పట్టుకున్నది. ఇంతలో తలుపు దభాలున మూసిన చప్పుడయింది. బండరాముడు, "అవ్వా, కాకి వంటింటో చేరింది. దబ్బునరా, దబ్బునరా!" అని కేకలుపెట్టాడు. "చంపు! చంపు!" అని తిరిగి కేకపెట్టింది అవ్వ.

కాకమ్మ తల్లిదండ్రులు చుట్టు పక్కల ఉన్న కాకులను గొంతెత్తి పిలిచారు. బండరాముడు పరిగెత్తిపోయి కాకమ్మను చంపడానికి పెద్ద గడ తెచ్చాడు. అది పట్టుకుని లోపలికివచ్చి మళ్లీ తలుపుమూసేశాడు. కాకమ్మ లోపల ఇరుక్కుపోయింది. బండరాముడి చేతిలో గడనుంచి తప్పించుకోవటానికి అటకమీద జాడీల దగ్గిర చేరింది. బండరాముడు కాకమ్మకేసి గడ బలంగా విసిరాడు. కాకమ్మ పక్కకు తప్పుకుంది. అటకమీది జాడీలు కిందపడి పగిలిపోయాయి.

"ఏం చేస్తున్నావురా, బండవెధవా? చాల్లే నీ కాకివేట!" అని అవ్వ బయటినుంచి లబలబలాడింది.

"ఈసారిచూడు, అవ్వా! ఈకాకి నేంచేస్తానో!" అని అరిచాడు బండరాముడు. ఈసారి వాడు కొట్టినదెబ్బ పొయిమీది బూరెలమూకుడుకు తగిలి నెయ్యి యావత్తూ పొయిలోపడి భగ్గున అంటుకుంది. బండరాముడికి భయంవేసి తలుపు తెరిచాడు. ఆ సందులో కాకమ్మ బయటికి జారుకుని తల్లిదండ్రులను చేరుకుంది. అవ్వ బండరాముణ్ణి బాదటం కాకులంతా చెట్టుమీదినుంచి చూశాయి.

"ఆ కుర్రవాడు నిన్నంటలేదు కద? ఎందుకంటే మనిషి చెయ్యి తగిలితే కాకి మైలపడుతుంది. మైలపడ్డ కాకినెవరూ పెళ్లాడరు," అంది కాకమ్మతల్లి.

"లేదమ్మా. నన్నా అబ్బాయి తాకలేదు." అన్నది కాకమ్మ తల్లితో.

ఆనాటినుంచీ కాకమ్మ స్వతంత్రంగా ఎక్కడికి పడితే అక్కడికి పోసాగింది.






సీత

హూత్, ఉడతా! హాత్ ఉడతా! ఊరికి వెడతావా?

ఉడత

ఛాత్, సీతా! ధూత్, సీతా! తప్పక వెడతాను!

సీత

బండీలేదు, బస్సూలేదు, ప్రయాణ మెట్లాగా?

ఉడత

కొమ్మలుతెచ్చి ఆకులుతెచ్చి గూడు కడతాను,
చిన్నా పెద్దా రెమ్మలుతెచ్చి చెక్రాలు కడతాను!
తొండా గుర్రం బండికి కట్టి తోలుకు వస్తాను!
బండీమీద కొరడా పట్టుక బైరా యిస్తాను.

కాశీ వెడతా, బొంబయి వెడతా, కలకత్తా చూస్తా!
కావలిసొస్తే ఢిల్లీకూడా కదిపేసే వస్తా!
జిన్నాగారికి గాంధీజీకి స్నేహం చేస్తాను.
చెన్నాపట్నం సాయంత్రానికి చెంగున వస్తాను.




"బండరాముడూ, ఒరే బండ రాముడూ!"

నేను బడికి పోతుండగా ఎవరో వెనకనించి పిలిచారు. వెనక్కి తిరిగి చూతునుగదా, గోపి. వాడు అయిదో క్లాసు చదువుతున్న అల్లరి వెధవ. నాకూ వాడికీ సావాసంలేదు. అయినా వాడు నా సంగతి వినిఉంటాడు. మా బడిలో బండరాముడంటే ఎరగనివాళ్లెవరు? మేష్టార్లుకూడా నన్నుగురించి మాట్లాడుకుంటారుట.

గోపీ నన్ను కలుసుకుని, "ఒరే, మామిడికాయలు దొంగిలింతామా? మనదారిలోనే గోడమీదికి వాలి ఒక మామిడి చెట్టున్నది. దానికాయలు బలే బాగుంటై. కోసుకుందామా?" అన్నాడు.

"నేను దొంగతనాలు చెయ్యను. మా నాన్నకు తెలిస్తే చితకబొడుస్తాడు," అన్నాను నేను.

"నువు దొంగతనం చెయ్యవద్దులే. నీకంత భయమైతే, నేనే చేస్తా. నువు ఊరికే తోడుండు." అన్నాడు గోపీ.

గోపిగాడి ధోరణి నా కర్థం కాలేదు. కాని రానంటే తంతాడని వాడివెంట వెళ్లటానికి ఒప్పుకున్నాను.

మామిడితోట దగ్గిరికి వచ్చాము. రోడ్డుపక్క గోడమీదుగా అంటు మామిడికొమ్మలు వేలాడుతున్నాయి.

"నువు గోడకు ఆనుకుని నిలబడు. నీ బుజాలమీద ఎక్కి నేను కాయలు కోస్తాను. కాయల్లో నీకుకూడా భాగం పెడతాలే," అన్నాడు గోపీ.

తప్పే దేమున్నదీ? నేను ఒప్పుకోనన్నానా, గోపిగాడు నన్ను తప్పక తంతాడు. పెద్దవాళ్లచేత తన్నులు తిన్నా గౌరవం. ఈ వెధవచేత తన్ను లెందుకు తినాలి? అందుకని ఒప్పుకున్నాను.

నేను గోడకానుకుని నిలబడ్డాను. గోపిగాడు నా బుజాలమీద నిలబడి కాయలు కోశాడు. జేబులనిండా, పుస్తకాలసంచీనిండా పట్టినన్ని కాయలు కోశాడు. తరవాత దిగివచ్చి ఒక కాయ తీసుకుని తింటూ నాకు భాగం పెట్టకుండా వెళ్లిపోసాగాడు. నేను వెంటపడి నా భాగం నాకు పంచమన్నాను.

వాడు పళ్లికిలించి, "పోరా, పో! నువ్వు నా గుర్రానివి. గుర్రాల కెవరైనా మామిడి పళ్లు పెడతారా ఏమిటి?" అన్నాడు. ఇదంతా మా క్లాసుపిల్ల లెవరో చూశారు.

ఆరోజునుంచీ నాకు మా బడిపిల్లలు "గోపిగాడి గుర్రం" అని పేరు పెట్టారు. అటువంటి వెధవతో సావాసం చేసినందుకు నాకు ఇలా కావలసిందేలే.

ఈ సంగతి మా నాన్నకుకూడా ఎట్లాగో తెలిసింది. ఆయన నాకు చక్కగా దేహశుద్ధి చేశాడు. ఇక జన్మలో ఎన్నటికీ అల్లరి వెధవలతో కలవగూడ దనుకొన్నాను.

ఆ తరవాత కొన్నాళ్లకు ఒకనాడు మధ్యాన్నం మా మేష్టారు నన్ను పిలిచి, "రాముడూ, కాఫీహోటలుకు వెళ్లి రెండు మసాలా వడలూ, రెండు దోసెలూ కట్టించుకో, పచ్చడి మరిచిపొయ్యేవు సుమా. ఈ సీసాలో వేడిగా ఒక కప్పు కాఫీ పోయించుకుని వేగిరం పట్టుకురా, ఇదుగో రూపాయి," అన్నారు.

సరేనని నేను కాఫీహోటలుకు దౌడుతీశాను. బడిగేటుదగ్గిర నాకు కిష్టాయి కనిపించాడు. వాడు మూడోక్లాసు చదువుతున్న మొండివెధవ. వాడినాన్న చిన్న జమీందారు. బళ్లో అందరూ వాడి స్నేహితులే. వాడి యీడువాళ్లంతా సెకండు ఫారం చదువుతుంటే వాడు ప్రతిక్లాసూ మూడేసిదండ





కిష్టాయీ నేనూ కలిసి "చంద్ర భవన్" హోటలుకు వెళ్లాం. ఠీవిగా కిష్టాయొక కుర్చీలో కూర్చున్నాడు. భయపడుతూ వాడికెదురుగా నేనొక కుర్చీలో కూర్చున్నా. దర్జాగా కిష్టాయి ఒక్కో ప్లేటు గులాబ్ జామూన్, ఉల్లిగారెలూ, ఒక్కోకప్పు కాఫీ తెప్పించాడు. అంతమంచి పదార్థాలు నే నెప్పుడూ తినలా. బలే బాగున్నాయి.

యాత్రలు చేస్తూ ఉన్నాడు. చదువులో వాడు నాకన్నకూడా మొండి. అయితే కిష్టాయి అల్లరిలో బాగాఆరి తేరినవాడు. వాడు నన్ను చెయ్యిపట్టుకుని ఆపి, "నా వెంటరారా, మీ అయ్యవారికి కావలిసిన ఫలహారాలన్నీ కానీ ఖర్చులేకుండా ఇప్పిస్తాను. పైపెచ్చు మనంకూడా ఊరికే ఫలహారంచేతాం," అన్నాడు.

కిష్టాయికేం? జమీందారుబిడ్డ. వాడి దగ్గిర బోలెడంత డబ్బుంటుంది. నాకు మావాళ్లెప్పుడూ కానీకిమించి ఇవ్వరు. అదైనా ఎప్పుడోగాని ఇవ్వరు.

మా ఫలహారం అయిపోగానే కిష్టాయి అయ్యవారికోసం రెండువడలూ, రెండు దోసెలూ, సీసాడుకాఫీ అర్డరిచ్చాడు. తరవాత వాడు డబ్బుతీసుకునే ఆయనదగ్గిరికి వెళ్లి, "మా మేష్టారు మమ్మల్ని ఫలహారం చేసిరమ్మనీ, తనకు ఫలహారం తెమ్మనీ చెప్పారు. ఈఫలహారం ఆయనకిచ్చి నేను డబ్బులు తెస్తాను. అంతదాకా ఈ అబ్బాయి ఇక్కడే ఉంటాడు," అని చెప్పాడు. నా దగ్గిరికివచ్చి రహస్యంగా, "నీ దగ్గిర ఉన్న రూపాయి నా కిచ్చెయ్యి. మిగతాది నేను వేసుకుని బాకీతీర్చేస్తాను" అన్నాడు.

నాదగ్గిర ఉన్న రూపాయి కాస్తా వాడి కిచ్చేశాను. వాడా రూపాయి జేబులో వేసుకుని, నన్నక్కడే కూర్చో మని, అయ్యవారి ఫలహారం పట్టుకుని బయల్దేరాడు.

కిష్టాయికోసం చూసీ, చూసీ, నాకు విసుగెత్తింది. మూడుగంటలైనా వాడు రాడు. హోటలువాడికీ విసుగెత్తింది కాబోలు. వాడు నాతో, "మా నౌకరును నీ వెంట పంపిస్తాను, డబ్బిప్పించు. లేదా నిన్ను పోలీసులకు వప్పగిస్తాను," అన్నాడు. నాకు ముచ్చెమటలు పోశాయి. నన్ను కిష్టిగాడు మోసం చేశాడు. నేను మొద్దు వెధవనుగనక నన్నందరూ మోసం చేస్తారు. మేష్టారేమంటారో అని నాగుండెల్లో రైళ్లు పరిగెత్తాయి. నాయరును వెంటబెట్టుకుని కుక్కిన పేనల్లే బడికివచ్చాను.

నా మొహం కనపడగానే మేష్టారి కళ్ల వెంట నిప్పులు కురిశాయి.

"పుండాఖోర్, ఇంతసేపు ఎక్కడ తిరుగుతున్నావ్? నా రూపాయి నాకు



పంపించావే, కాఫీ ఎట్లా సంపాదించావ్?" అని అడిగారు. నానోట మాట రాలేదు. కాని నావెంటవచ్చిన హోటలు నౌకరు జరిగినదంతాచెప్పాడు.

ఈ కథ విని క్లాసులో పిల్లలంతా గొల్లున నవ్వారు. మేష్టారికికూడా నవ్వాగలేదు. ఆయన కిష్టాయికోసం కబురుచేశాడు. కాని వాడు క్లాసులోలేడు. అందుచేత హోటలు మనిషికి రెండు రూపాయిలూ మేష్టారేదర్శించుకున్నారు.

ఆ సాయంత్రం నన్ను వెంటబెట్టుకుని మేష్టారు కిష్టాయి నాన్నగారింటికి వెళ్లారు. జమీందారుగారు సంగతంతా విని మేష్టారికి రెండు రూపాయిలూ ఇచ్చేశారు.



అందాలు చిందేటి చందమామా, ఆడు
కుందాము రావోయి చందమామా!

మల్లె పందిరికింద బుల్లి బుజ్జాయుంది,
బుజ్జి తల్లికి లాల పోసి పోదువుగాని,
చల్లంగ రావోయి చందమామా, మెల్ల
మెల్లంగ రావోయి చందమామా!



వెండిగిన్నెలో వేడి బువ్వపెట్టూకోని,
బంగారుగిన్నెలో పాయసం పోసుకొని,
తిందాము రావోయి చందమామా, నవ్వు
కుందాము రావోయి చందమామా!

చక్కన్ని చుక్కలతో సయ్యాట లాడుతూ,
మబ్బు గుఱ్ఱాలెక్కి దబ్బునా పొయ్యేవు,
మాట వినిపోవోయి చందమామా, ఒక్క
మాటు దిగి రావోయి చందమామా!

గో. శ్యామసుందర్.
గుంటూరు.




# అన్నదమ్ములు

**అనగా** అనగా వొకవూళ్లో రామయ్యా, సోమయ్యా అని యిద్దరు అన్నదమ్ము లుండేవాళ్లు. రామయ్యా పెద్దవాడు; తెలివిగలవాడు. సోమయ్యా చిన్నవాడు; అమాయకుడు. రామయ్యా భార్య భాగ్యవంతులబిడ్డ. అందుచేత గర్వంగా వుండేది. సోమయ్యా భార్య బీదయింటి పిల్ల. అందుచేత కొంచెం అణకువగా వుండేది. రామయ్యా తన తెలివితేటలన్నీ తమ్ముడిమీద ఉపయోగించి అతని ఆస్తి అంతాకాజేసి తాతలనాటి చిన్న పాతయిల్లూ, నాలుగెకరాల మెట్టచేను మాత్రం అతనికి యిచ్చాడు. పెద్దమేడ మిగతా ఆస్తీ అంతా తను ఉంచుకున్నాడు. పాపం, సోమయ్యా దాంతోనే తృప్తిపడి కష్టపడి చేను దున్నుకుంటూ, వచ్చిందాంట్లో తను కొంత తిని, మిగతాది ధర్మంచేస్తూ వుండేవాడు.

ఇలా వుండగా వొకనాటి రాత్రి ఎవరో సన్యాసి, రామయ్యా యింటికొచ్చి తలుపుతట్టాడు. రామయ్యా వచ్చి కిటికీ తెరిచి "ఎవరు నువ్వు? ఎందుకీ అర్ధరాత్రప్పుడు తలుపు తట్తావు?" అని గద్దించాడు.

అప్పుడు సన్యాసి "బాబూ, నేను సన్యాసిని. రామేశ్వరం పోతూ యిటొచ్చాను. ఈ రాత్రి నాకు కొంచెం తిండి పెట్టి పడుకోనివ్వండి. ఉదయాన్నే వెళ్లిపోతాను" అన్నాడు.

"ఏంటీ, మాయింట్లో వల్లగాదు పో, పో. అదుగో, అ ఎదురుగానే వున్నాడు షాహుకారు. వాడి దగ్గిరికి పో. దోవన యేసన్యాసిపోతున్నా పిలిచి అన్నం పెడతాడు." అన్నాడు రామయ్యా.

యోగి పోయి సోమయ్యా తలుపు తట్టాడు. సోమయ్యావచ్చి తలుపుతెరిచి

సన్యాసిని యింట్లోకి తీసుకుపోయి, భార్యతో చెప్పి అన్నం పెట్టించాడు.

సన్యాసి భోజనం చేసిన తర్వాత సోమయ్య అయనకి పక్క వేసి అతను నిద్రపోయిందాకా విసుర్తూ కూచున్నాడు.

సన్యాసి హాయిగా నిద్రపోయి ఉదయాన లేచి వెళ్లేటప్పుడు సోమయ్యనూ అతని భార్యనూ పిలిచి "మీకు మూడు వరాలిస్తాను. కోరుకోండి" అన్నాడు.

సోమయ్య "స్వామీ, నాకు, నలుగురు ఇంటికివస్తే, ఉండటానికి పెద్ద యిల్లూ, బీదలకు ఎంత ధర్మంచేయటానికైనా చాలిన డబ్బూ యివ్వండి. అదిచాలు" అన్నాడు.

సోమయ్య పెళ్లాం "స్వామీ, నాకేమీ వద్దు; యితరులకు లేదనకుండా ధర్మం చెయ్యటానికి నాకు బుద్ధి పుట్టించు" అని రెండో వరం అడిగింది.

మూడో వరంగా, సోమయ్య "స్వామీ, మాకు యెప్పుడూ యితరులకు మేలు చెయ్యాలనే బుద్ధి వుండేట్టుగా వర మివ్వండి" అని అడిగాడు.

సన్యాసి చిరునవ్వు నవ్వి వెళ్లిపోయాడు. మర్నాడు ఉదయాన రామయ్య లేచి చూసేసరికి అతని యింటి ముందు పెద్ద మేడవుంది. రామయ్య దబదబ పెళ్లాన్ని పిలుచుకుని మేడ దగ్గరకి పరుగెత్తాడు. అ మేడలో అతని తమ్ముడూ తమ్ముడి భార్యా వున్నారు. రామయ్య "యిది ఎలా వచ్చిం"దని తమ్ముణ్ణి అడిగాడు. సోమయ్య రాత్రి జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

ఇక రామయ్య పెళ్లానికి కడుపు ఉబ్బరం అగలేదు. మొగుణ్ణి గుర్రం ఎక్కిపోయి సన్యాసిని పట్టుకు రమ్మని బలవంతపెట్టింది. అతన్ని పిలుచుకొస్తే రాజులాగా చూస్తానని హామీ కూడా ఇచ్చింది.

రామయ్య గుర్రం వేసుకుని వెళ్లాడు. కొంతదూరం పోయేవరకు సన్యాసి కనిపించాడు. రామయ్య రొప్పుతూ, రోజుతూ "స్వామీజీ! రాత్రి మావల్ల చాలా నేరం

జరిగింది. ఈమాటు మా యింటికి రండి. మిమ్మల్ని రాజులాగా చూస్తాము. నా భార్యకూడా మిమ్మల్నితీసుకురమ్మన్నది" అని బ్రతిమాలాడు.

"బాబూ! ఏదో నాదోవను నేను తీర్థ యాత్రలకు పోతున్నాను; నేను రాలేను." అన్నాడు సన్యాసి.

"అలాగైతే ఎట్లా స్వామీ! నా భార్య ఊరుకోదు. మీరు రాకపోతే కనీసం మా తమ్ముడికిచ్చిన మూడు వరాలైనా ఇచ్చి వెళ్లండి." అన్నాడు రామయ్య.

సన్యాసి రామయ్య వదలడని అనుకొని - "సరేలే నీకూ నువ్వుకోరుకున్న మూడు కోరికలు సిద్ధిస్తయి" అన్నాడు.

రామయ్య పట్టరాని సంతోషంతో, గుర్రాన్ని మరీ వేగంగా పరుగెత్తిస్తూ ఇంటి వేపుకు బయలుదేరాడు. గుర్రం నోటివెంట నురుగులు కక్కుతూ, భూమిమీద కాళ్లు అనకుండా దౌడుతీస్తున్నది.

యింతలో రామయ్యకి వొక దుర్బుద్ధి పుట్టింది. "గుఱ్ఱం ఇంత త్వరగా పరుగెత్తుతున్నదే వొకవేళ చచ్చిపోతే ఎట్లాగా?" అనుకున్నాడు. అనుకోవటంతోటే, గుఱ్ఱం ధామ్మని క్రిందపడి చచ్చింది.



రామయ్య గుఱ్ఱంతోపాటు కిందపడ్డాడు. పడి, లేచి దుమ్ము దులుపుకుని చచ్చిన గుఱ్ఱాన్ని చూసి విచారపడ్డాడు. అతనికి గుఱ్ఱాన్ని వొదిలిపెట్టి వెళ్లడానికి బుద్ధి పుట్టలేదు. ఐనా ఏమిచేస్తాడు. వెళ్లకతప్పదు. "గుఱ్ఱం చావనేచచ్చింది. ఈ జీను వొదిలి పెట్టటం ఎందుకా" అని దాన్ని తీసుకుని నెత్తిన పెట్టుకుని బయలుదేరాడు.

కొంత దూరం వెళ్లేసరికి అతనికి జీను బరువేసింది. పెళ్లాం మాటలువిని యింత దూరం వచ్చినందుకు అతను విసుక్కున్నాడు. విసుక్కొని "పాపమని, నన్ను యోగికోసం పంపి తను హాయిగా యింటి దగ్గర కూర్చుంది. ఈ జీను దాని నెత్తిన ఉంటే తెలిసేది నా కష్టం!" అని అనుకున్నాడు. ఇతను అనుకోవటమేమిటీ, ఆ జీను మాయమవటమేమిటీ వొక్కసారే జరిగినై.






రామయ్య మూడింట్లో రెండు వరాలు యిలా వూరికే పోగొట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ యింటికివచ్చాడు. ఇంట్లో పెళ్ళాం కూర్చునివున్నది. అమె నెత్తిమీద జీను. అమె రామయ్యని చూడగానే మండిపడుతూ, 'ఏమిటిదీ? ఎట్లావచ్చింది నీ జీను నా. నెత్తిమీదికి?' అని అడిగింది.

రామయ్య కప్పుడు తను అనుకున్న మాట జ్ఞాపకం వచ్చింది. "ఇదుగో, జరిగిన పొరబాటేదో జరిగిపోయింది. నువ్వు వోర్పుగా జీను మోస్తూవుండు. మనదగ్గిర యింకోవరం మిగిలివున్నది. దీంతో మనం యేదైనా మంచివరం కోరుకుని ధనవంతులమయి హాయిగా వుందాం." అన్నాడు.

ఈ మాటలు వినేవరకు అతని పెళ్ళాం మండిపడింది. "నువ్వూ నీ డబ్బూ పోయి గంగలో పడండి తర్వాత. ముందు నా నెత్తిమీది జీను దించు. లేకపోతే బాగుండదు చెప్తున్నాను" అన్నది.

పాపం రామయ్య పెళ్ళానికి భయపడి "జీను వూడిపోవాలి" అని కోరుకున్నాడు. జీను వూడి క్రిందపడ్డది.

చూశారా! రామయ్య దుర్బుద్ధితో యింత కష్టపడీ తెచ్చుకున్న మూడు వరాలు యిట్లా మట్టిలో కలిసిపోయినై.



గీక్షసులు

రాక్షసి పారిపోయినాక గుడ్డివాడూ, చెమిటివాడూ "అబ్బ! బ్రతికిపోయాం," మనుకున్నారు. ఇంకా అక్కడే ఉంటే మళ్ళీ వస్తాడేమోనని వాళ్ళకి భయం వేసింది. అప్పటికి వాన వెలిసింది. మబ్బులు విచ్చిపోయినై. వెన్నెల కాసింది. చెమిటివాడికి ఆ యింటో ఒక మూలను ఏదో గుట్ట కనపడింది. దగ్గరికి పోయి చూశాడు. వెండీ బంగారునగలూ, నాణేలూ. చెమిటివాడు, గుడ్డివాడికి ఈ సంగతి చెప్పి అవన్నీ నాలుగుమూటలు కట్టి రెండుమూటలు గాడిదమీద, మిగతా రెండు మూటలూ చెరిఒకరు వేసుకుని ఆ రాత్రికి రాత్రే బయలుదేరి వెళ్లారు.

ఇక రాక్షసి ఏమిచేశాడూ? ఆ పరి గెత్తడం పరిగెత్తడం రొప్పుకుంటూ, రోజుకుంటూ వాళ్ళ మామగారి ఇంటికి పోయిపడ్డాడు. పడి ఈ సంగతంతా మామకూ, బావమరదులకూ చెప్పాడు. వాళ్లకి ఈమాటలు వినేవరకు కోపం వచ్చింది. "ఛా! పనికిమాలిన వెధవా! రాక్షసజాతికి అవమానం తెచ్చావు. పద, మేము వస్తున్నాము. ఆ గీక్షసులు ఎక్కడ ఉన్నారో చూపించు," అన్నాడు

మన రాక్షసి మామనూ, బావమరు దులనూ వెంటబెట్టుకుని తన యింటికి వచ్చాడు. అక్కడ ఎవ్వరూలేరు. పైగా ఇంటిలోఉన్న ధనమంతా పోయింది. ఇక అంతా కలిసి గీక్షసులను వెతుక్కుంటూ అడివినిపడ్డారు.

మీరు రాక్షసులపేర్లు ఎప్పుడన్నా విన్నారూ? చాలా గమ్మత్తుగా ఉంటై వాటిపేర్లు. మన రాక్షసిపేరు దోనెకడుపు రాక్షసి. వాడి మామపేరు కొంగకాళ్ల



రాక్షసి. వాడి పెద్ద బావ మరిది పేరు గెద్దముక్కు రాక్షసి. రెండోవాడి పేరు పులిమొహం రాక్షసి. మూడోవాడి పేరు పిల్లికళ్ల రాక్షసి. నాలుగోవాడి పేరు గాడిదచెవుల రాక్షసి.

ఈ రాక్షసులు వెతుక్కుంటూరావడం మన గుడ్డివాడు కనిపెట్టాడు. వాడు చప్పుడువిని-"చెమిటన్నా! రాక్షసులు మన వెంటపడ్డారు. గాడిదని అడివిలోపలికి తోలి, మన ఇద్దరం చెట్టు ఎక్కితే బాగుంటుంది. వాళ్లు దాటిపోయిన తర్వాత మనం వెళ్లవచ్చు," అన్నాడు.

చెమిటివాడు సరేనని గాడిదను అడివిలోకి తోలి, చెట్టెక్కి కూర్చున్నారు. రాక్షసులు చెట్టుదగ్గరికి వచ్చి గుడ్డివాణ్ణి చూశారు. కొంగకాళ్ళ రాక్షసి ముందు వీణ్ణి పట్టుకుతిందామన్నాడు. అక్కడినించి ఒకళ్లమీద ఒకళ్లు ఎక్కి అందరికీ పైన గాడిదచెవుల రాక్షసిని ఎక్కమన్నారు.

గుడ్డివాడికి వీళ్ళమాటలు వినేవరకు భయంవేసింది. చేతులతో అటూ ఇటూ తడవటం మొదలుపెట్టాడు. వాడి చేతికి గాడిదచెవుల రాక్షసి చెవులు చిక్కినవి. వాడు తన సత్తువంతాచూపి ఆ చెవులు మెలిపెట్టాడు। ఇటు చెమిటివాడు 'పోనివ్వమాకు! అట్లాగే పట్టుకో!' అని కేకవేశాడు.

ఇంకేం! ఆ నొప్పికి, ఈ కేకలకూ ఆగలేక గాడిదచెవుల రాక్షసి గీపెడుతూ ఒక్క దూకున కిందికిదూకి పారిపోయాడు. వాడి అరుపూ, పారిపోవటమూ చూసి మూడోవాడూ, మూడోవాణ్ణిచూసి రెండోవాడూ ఇట్లా అంతా చావుపరుగు తీశారు.

వాళ్లు పారిపోయినాక గుడ్డివాడూ, చెమిటివాడూ చెట్టుదిగి వచ్చారు. చెమిటివాడు గాడిదను వెతుక్కుని తోలుకు

వచ్చాడు అప్పటికి తెల్లవారింది ఇద్దరూకలిసి ఊరిముఖంగా ప్రయాణం సాగించారు. ఊరిదగ్గరికి చేరినాక చెమిటివాడు— "గుడ్డిమామా! గుడ్డి మామా! మనం ఊరిదగ్గరికి చేరాము. ఇక ఫర్వాలేదు. మనం తెచ్చుకున్నది భాగాలు వేసుకుందామా?" అన్నాడు.

గుడ్డివాడు సరే నన్నాడు. చెమిటి వాడు భాగాలువేశాడు. అందులో చెమిటి వాడు తన భాగానికి కాస్త ఎక్కువగా వేసుకున్నాడు. గుడ్డివాడు రెండు రాసులూ చేతులతో తడివిచూశాడు. తనభాగం చిన్నది. వాడికి కోపంవొచ్చి చెమిటివాడిని చరిచి కొట్టాడు చెంపమీద. ఆ దెబ్బకు చెమిటివాడు బిత్తర పోయాడు. తర్వాత సంబాళించుకుని వాడు గుడ్డివాడి కణతమీద లాగిగుద్దాడు!

ఈ గుద్దుతో గుడ్డివాడితల తిరి గింది కాసేపు తల దిమ్ముగాఉంది. ఆతర్వాత చిత్రమేమంటే వాడికి కళ్లు



కనపడటం మొదలుపెట్టినై. ఇటు చెమిటివాడికి ఆచెంపదెబ్బతో వినపడటం మొదలుపెట్టింది. ఈసంగతి ఒకరి కొకరు చెప్పుకున్నారు. ఆ తర్వాత న్యాయంగా భాగాలువేసుకుని, పక్క వూరుపోయి హాయిగా ఉన్నారు.

చూశారా గమ్మత్తు. కలిసి వచ్చే టప్పుడు మనం పొరపాట్లుపడ్డా మనకు మంచే కలిగిస్తాయి.



## రాజుగారు

రాజుగారి ముక్కుమీద
దోమ కుట్టింది.
రాజ్యంలో ప్రజకంతా
హడలెత్తింది!

సామంతులు, సర్దార్లూ,
బంట్లూ, సైన్యాధిపతులు
కత్తులతో ఈటెలతో
కదనానికి లేచినారు.

కత్తులతో నరకలేక
ఈటెలతో పొడవలేక
సర్దార్లూ సామంతులు
చలచల్లగ జారినారు.

తిరిగి తిరిగి దోమ మళ్లీ
రాజుకడకె వచ్చింది.
జనమంతా చూస్తుండగ
ముక్కుమీద వాలింది.



# దోమగారు



జనమంతా విస్తుపోయి
నోళ్లుతెరచి చూస్తుంటే
బంటొక్కడు బుద్ధిశాలి
పరుగెత్తెను రాజుకడకు.

ఏమరుపాటుగ నుండిన
దోమను గురిచూచివాడు
రాజుగారి ముక్కుమీద
చేతికొద్ది గుద్దినాడు.

ఆ దెబ్బకి రాజుగారు
హరిహరి అని అరిచినారు
ఆదెబ్బకి దోమగారు
హరహరమని వాలినారు.

బంటుసేవ బంటుచేవ
ప్రజలంతా మెచ్చినారు
తక్షణమే రాజతణ్ణి
తన మంత్రిగ చేసినాడు.



## అబ్బి - చిట్టి

బి. వి. శ్రీనివాసాచార్య

★

అబ్బి

చిట్టీ! పొట్టీ! సిగరెట్టు పెట్టీ!
శ్రావణ పట్టీ! నాకా రొట్టీ!

చిట్టి

అబ్బీ! గొబ్బీ! పౌడరు డబ్బీ!
ఇత్తడి సిబ్బీ! మా అబ్బీ.

అబ్బి

మా చిట్టిమొగుడికి బానంతపొట్ట!
పొట్టనిండా రెండుబుట్టలుండ్రాళ్లు!!

చిట్టి

అబ్బిగాడి పెళ్లానికొండంతగూని!
గూనెక్కి అబ్బియ్య కోటకెళతాడు!!

అబ్బి

అమ్మా! చిట్టిని తన్నేస్తా!!

చిట్టి

చూడమ్మా, ఈ అన్నయ్యా!

అమ్మ

అల్లరిచేస్తే అబ్బికి, చిట్టికి
అప్పచ్చులు లేవు!

[అబ్బి చిట్టి గప్‌చిప్]

## కుటుంబంలో రాకలు

అమరావతినుంచి అమ్మగారు రాక
నరసాపురంనుంచి నాన్నగారు రాక
అనకాపల్లినుంచి అత్తగారు రాక
మచిలీపట్నంనుంచి మామగారు రాక
హైద్రాబాద్‌నుంచి అప్పగారు రాక
భద్రాచలమునుంచి బావగారు రాక
అనంతపురంనుంచి అన్నగారు రాక
ఒంగోలునుంచి ఒదినగారు రాక
బాపట్లనుంచి భర్తగారు రాక
చెన్నపట్నంనుంచి చందమామ రాక!

చిన్నకోట జోగిరాజు, తణుకు.

## గొలుసు మాట

మాట మాట - ఏమి మాట?
మంచి మాట - ఏమి మంచి?
పూలు మంచి - ఏమి పూలు?
మల్లె పూలు - ఏమి మల్లె?
తెల్ల మల్లె - ఏమి తెల్ల?
పువ్వు తెల్ల - ఏమి పువ్వు?
నవ్వు పువ్వు - ఏమి నవ్వు?
మామ నవ్వు - ఏమి మామ?
చందమామ

అవసరాల రామకృష్ణరావు, తుని.



# సోమరిపోతు



అనగా అనగా ఒక ఊళ్లో ఒక సోమరిపోతు ఉండేవాడు. వాడు ఇటు గడ్డిపోచ తీసి అటువేసేవాడు కాదు. పోనీ తిండి తినడు అందామా, ముగ్గురు మనుషులకు సరిపోయేది తేలిగ్గా యీడ్చే వాడు; అదీ వాడిదగ్గరకు తీసుకువచ్చి అందించాలి.

ఇక ఆఊళ్లో మిగతావాళ్ళకి రాత్రిం బగళ్లు చెమటవోడ్చి పనిచేసేసినా కడుపు నిండీ నిండకుండా ఉండేది. వాళ్లు ఎన్నాళ్లు వేగుతారు, ఈ సోమరి పోతుతో. ఊళ్లోనించి తన్ని తరిమారు.

ఆ పక్క గ్రామంలోనే ఇంకో కష్ట జీవి ఉండేవాడు. వాడు వొళ్లు దాచుకో కుండా రోజల్లా శ్రమపడేవాడు. అయినా వాడికి తిండికి అస్తాహస్తంగా చాలేది. ఇక ఆగ్రామంలో మిగతా వాళ్లు అంతా సోమరిపోతులు. వొళ్లువంచి పనిచేసే వాళ్లుకారు దొంగతనాలూ అవీ చేసి మఃపొ్వద్దులా తినేవాళ్లు. అలాంటివాళ్లు కష్టంచేసే వాళ్లనిచూసి ఎలాసహిస్తారు? వాడిని అందరూ కలిసి కాకుల్లాగా పొడిచి ఆగ్రామంనించి వెళ్లగొట్టారు.

ఇక సోమరిపోతుకు వూరికే తిండి దొరికే మరోవూరు కావాలి. దానికోసం కాళ్లీడ్చుకుంటూ బయలుదేరి, కొంత దూరం పోయేవరకు బద్ధకంవేసి చెట్టు కింద పండుకుని నిద్రపోయాడు. ఇటు కష్టజీవి ఏగ్రామంలో పని దొరుకు తుందా, చేసిన పనికి మెప్పువస్తుందా అని బయలుదేరాడు. అతను దోవను వస్తూవస్తూ చెట్టుకింద పడుకున్న మన సోమరిపోతును చూసి దగ్గరికి వచ్చాడు.

అప్పటికి తూర్పు బాగా తెల్ల వారింది. సూర్యుడు ఉదయించాడు. మన కష్టజీవి సోమరిపోతును పలక రించాడు. ఇద్దరూ తమ తమ కష్ట సుఖాలు చెప్పుకొన్నారు. ఇంతలో పడ



మటి దిక్కున ఏదో ధగ ధగ మెరుస్తూ కనిపించింది. దాన్ని చలవరాతితో కట్టారు. దాని గోపురాలకు బంగారు పూత పూశారు. ఇద్దరూ అటువేపు చూశారు. అది ఒక దివ్యమైన భవనం. బాలసూర్యుని లేత కిరణాలు దానిమీదపడి బంగారంలాగా తళతళా మెరిసిపోతున్నది.

అప్పుడే దక్షిణపు వేపున, కోటిచంద్రుల కాంతితో మన బాటసారులకు ఒక దేవత కనిపించింది. ఆమె తేజస్సు చూడటానికి వెయ్యికళ్లు చాలవు. ఆమె వొంటి నిండా నగలు. మన బాటసారులు ఆశ్చర్యంతో ఆమె వంక చూస్తూ ఉండిపోయారు.

ఈ దేవత ఎవరోకాదు; లక్ష్మీదేవి. ఆమె మన బాటసారులనుచూచి, "ఓ బాటసారులారా? నేను లక్ష్మిని. ఆ కనిపించే భవనమే నాయిల్లు. మీరు ప్రొద్దుకూకేలోపల నాఇంటికి వచ్చినట్టయితే మీరు బ్రతికి ఉన్నంతకాలమూ నాకు అతిథులుగా ఉండి భోగభాగ్యాలతో తులతూగవచ్చు!" అని చెప్పి అంతర్ధానమయింది.

కష్టజీవికి ప్రాణం లేచివచ్చింది. ఇన్నాళ్లూ కష్టపడితే పొట్ట నిండలేదు. ఇవ్వాళ ఒక్కనాడూ కష్టపడితే ఇక జీవితంలో దరిద్రం ఉండదుగదా అనుకున్నాడు. అనుకుని సోమరిపోతుతో—

"విన్నావా తమ్ముడూ! మనం సాయంత్రం లోపల ఎలాగానన్నా పోయి ఆయింటో పడ్డామా ఇక మనకష్టాలు గట్టెక్కినట్టే. పద, త్వరగా పోదాము," అన్నాడు కష్టజీవి సోమరిపోతుతో.

"అబ్బో! అట్లా కనపడుతున్నది కాని, అది దగ్గర ఉన్నదనుకున్నావా? ఆమె మాటలు నమ్మి బయలుదేరితే మనం పరిగెత్తలేక ఛస్తాం! ఎందుకు అన్నయ్యా, వృధా ఆయాసం! పరిగెత్తి పాలుత్రాగేకంటే నిలబడి నీళ్ల త్రాగటం మంచిది!" అన్నాడు సోమరిపోతు. సోమరిపోతుతో వంతుపెట్టుకు కూచుంటే లాభంలేదనుకుని కష్టజీవి ఒంటరిగా భవనంకేసి నడవసాగాడు.

సోమరిపోతుకు కష్టజీవినిచూస్తే జాలివేసింది. 'ఇంతదూరం ఎట్లా నడుస్తాడా' అనుకున్నాడు. "ఇలాంటి సమయాలలో కథల్లో చెప్పే కీలుగుర్రం దొరికితే ఎంత బాగుండును! రివ్వున పోయి ఆమె యిచ్చే ఆతిధ్యమేమిటో తేల్చుకోవచ్చుగదా!" అనుకున్నాడు.

ఏమైనా సోమరిపోతు అక్కడి నించి కదలలేదు. పదిగంటలైంది. ఇంతలో వాడి కొక బక్కచిక్కిన గాడిద కనిపించింది. దాన్నెక్కిపోతే బాగుండదా అనుకుని, ఎక్కి సవారీ ఆరంభించాడు. గాడిద చచ్చేటట్టు పరిగెత్తింది. మధ్యాహ్ననికి సోమరిపోతు కష్టజీవిని కలుసుకున్నాడు. అతన్నిచూసి వెకిలిగా నవ్వి గాడిదను బాదుకుంటూ ముందుకు వెళ్లిపోయాడు. గాడిద



కొంతదూరం నురుగులు కక్కు కుంటూ కక్కుకుంటూ పరిగెత్తి రోడ్డు మీదపడి ప్రాణాలు విడిచింది. సరే గాడిద ఎలానూ చచ్చింది; కాసేపు విశ్రాంతి తీసుకుందామని గాడిదను తలక్రింద పెట్టుకుని పడుకున్నాడు.

ఇంతలో వాడికొక తాబేలు కనిపించింది. సరే ఊరుకోవటం ఎందుకు? దాన్ని ఎక్కిపోదామని బయలుదేరాడు.

పొద్దుకూకబోతూ ఉండగా కష్టజీవి వచ్చి సోమరిపోతును కలుసుకున్నాడు. "తమ్ముడూ! పొద్దుకూకవచ్చింది. ఇక నన్నా తాబేలు వదిలి నాతోపరిగెత్తు, లేక పోతే చేరుకోలేము" అన్నాడు కష్టజీవి.

"అదుగో, ఆకనపడేదేగా ఇల్లు! ఇక్కడినించి పడుకుని దొర్లిగిలివెళ్లినా వేళకు చేరుతాము. నువ్వు ముందు పోయిమాత్రం ఏమిచేస్తావు?" అన్నాడు సోమరిపోతు.

కష్టజీవి వీడితో లాభంలేదనుకొని పరిగెత్తటం మొదలుపెట్టాడు. పొద్దు గర్భంలో పడుతుండగా కష్టజీవి వాకిట్లో అడుగుపెట్టాడు. లక్ష్మీదేవి వాడిని ఆహ్వానించి ఇంటోకి తీసుకుపోయింది.

సోమరిపోతు తాబేలుఎక్కి మెల్లిగా వాకిటిదగ్గరకు చేరుకునేవరకు తలుపులు మూసుకొంటున్నాయి. తలుపులు తెరవమని దబదబ బాదాడు సోమరిపోతు. ఉహూం. మళ్లా తలుపులు తెరుచుకోనే లేదు.

"ఛా. అనవసరంగా ఎంత శ్రమపడ్డాను....సరే, అయిందేమో అయింది! ఈరాత్రికి ఇక్కడే పడుకుందాము." అని వాకిలి మెట్టుమీద తలపెట్టి పండుకున్నాడు సోమరిపోతు.

తెల్లవారినాక చూస్తే సోమరి పడుకున్నచోట ఒక నత్తఉన్నది. అదే మన సోమరిపోతు బాటసారి.



# వెన్నెల బంతి

వెలిగింది వెలిగింది వెన్నెలా బంతి
వెలుగులో పాపల్లు వెలిగిపోతారు
దేదీప్యమానమౌ దివ్యతేజముతో
దీప్తివంతంబైన దీ పెద్దబంతి.

అంద చందాలతో అలరారు బంతి
ఆకాశవీధిలో అమరినాబంతి
పిల్లలందరకునూ ప్రియమైన బంతి
వెండి వెలుగులబంతి, వెన్నెలాబంతి.





రవివంశతిలకుండు రామచంద్రుండు
మారాముపెట్టినా గారాలబంతి
అందాల మేడలో అద్దాలలోకి
దిగివచ్చి, మాతోటి తిరిగేటిబంతి!

తిమ్మరాజు హైమవతి, రాజమండ్రి.

# పొట్టి పిచిక కథ

అనగా అనగా ఒక ఊళ్లో కుంచ మంత బ్రాహ్మడు ఉండేవాడు. అతను ఎంతో కష్టపడి కంచమంత జొన్నచేను వేసుకున్నాడు. అది అట్లా అట్లా పెరిగి కంకులువేయటం మొదలుపెట్టే వరకు రెండు భమిడిలేళ్లూ, రెండు వెండిలేళ్లూ వచ్చి రాత్రిళ్లు తినివేయటం మొదలుపెట్టినై. అవి తినిపోగా ఒకటీ అరా కంకి మిగిలితే మన పొట్టిపిచ్చిక వచ్చి పగలు తినివేస్తూ ఉండేది.



ఒకనాడు బ్రాహ్మడు పొలం వచ్చి చూసుకునే వరకు చేనంతా ఊటుపోయి ఉంది. ఒకటీ అరా అక్కడక్కడ మిగిలిన కంకులు పిచ్చిక తింటూఉంది.

పాపం బ్రాహ్మడికి ఏడుపూవచ్చింది, కోపం వచ్చింది. ఈ పిచ్చిక పని పట్టాలి అనుకుని బోయవాడి దగ్గరికిపోయి వల అడిగి తెచ్చి ఉచ్చు లేశాడు.



పాపం పొట్టిపిచ్చిక అది కానకుండా వచ్చి ఉచ్చుల్లో చిక్కుకుంది. ఇంకేం, బ్రాహ్మడు ఎగిరిగంతేసి దాన్ని చంకలో పెట్టుకుని ఇంటికి బయలుదేరాడు. ఇక మన పిచ్చిక ఊరుకుంటుందా? చంకలో కూచునే పాట ఎత్తుకుంది:

కుంచమంత బ్రాహ్మడికి గూ, గూ, గూ!
కంచమంత జొన్నచేను గూ, గూ, గూ!
రెండు భమిడీలేళ్ళు గూ, గూ, గూ!
రెండు వెండీలేళ్ళు గూ, గూ, గూ!

నండూరి చిట్టెమ్మ, సామర్లకోట.

చేనుకాస్త మేశాయి గూ, గూ, గూ!
నేనుకూడ తినబోతె గూ, గూ, గూ!
పొట్టివా డొచ్చాడు గూ, గూ, గూ!
పొంచిపొంచి చూశాడు గూ, గూ, గూ!
నన్ను పట్టుకున్నాడు గూ, గూ, గూ!

ఈ పాట వినేవరకు బ్రాహ్మడికి



కోపం వచ్చింది. చంక బాగా బిగించాడు. ఉహూఁ. మనపిచ్చిక నోరు ముయ్యలేదు.

మన బ్రాహ్మడు ఏం చేస్తాడూ? ఊళ్లోకి పోతే దీనిపాటవిని అంతా నవ్వుతారు। అందుకని ఊరిబయట ఉన్న శెట్టి గారిఅరుగుమీద కూచున్నాడు.

మన పిచ్చిక నోరు మూస్తేగా। పాడుతూనే ఉంది.

కుంచమంత బ్రాహ్మడికి గూ, గూ, గూ!
కుంచమంత జొన్నచేను గూ, గూ, గూ!
అని. దీని పాటవిని శెట్టి బయటికివచ్చి 'ఏమండీ శాస్త్రుల్లుగారు మీ జొన్నచేనెంతండీ?" అన్నాడు.



బ్రాహ్మడు దోసిట చూపి "ఇంత।" అన్నాడు.

"ఇంతేనా?" అన్నాడు శెట్టి.

"కాదు!" అని బ్రాహ్మడు రెండు అరిచేతులూ కాస్త ఎడంగా తీసి "ఇంత।" అన్నాడు.

"ఓసి, ఇంతేనా।" అన్నాడు శెట్టి.

అప్పుడు బ్రాహ్మడికి కోపంవచ్చి రెండు చేతులూ బారచాపి "ఇంత।" అన్నాడు.

ఇంకేం, చేయి తీసేవరకు మన పిచ్చిక తుర్రున పారిపోయి చెట్టుమీద కూచుని "కుంచమంత బ్రాహ్మడికి గూ, గూ, గూ।' అని పాడటం మొదలుపెట్టింది.

బ్రాహ్మడు బాగా మోసపోయానే అని తన్ను తిట్టుకుంటూ ఇంటికివెళ్లాడు.



## కలవలకాకి

దాసరి వెంకటరత్నం
కాకినాడ.

కాకి, కాకి కలవల కాకి
కాకిని బట్టి గంగలో ముంచితె
గంగా నాకు గంధామిచ్చె
గంధం తెచ్చి ఆవూ కిస్తే
ఆవూ నకు పాలూ ఇచ్చె
పాలూ తెచ్చి అమ్మాకిస్తే
అమ్మా నాకు జున్ను పెట్టె
జున్ను తెచ్చి పంతులుకిస్తే
పంతులు నాకు పద్యంచేప్పె
పద్యం మామకు వప్పగిస్తే
మామ నాకు పిల్లనిచ్చె
పిల్ల పేరు మల్లెమొగ్గ
నాపేరు సర్దార్ !

## మీకు తెలుసునా ?



ఏనిగపిల్ల నోటితో పాలు తాగుతుంది; తొండంతోకాదు





అన్నిటిలోకి త్వరగా పరుగెత్తే జంతువు చిఱుతపులి. గంటకు 80 మైళ్ళదాకా పోతుంది.






అనగా అనగా ఒకదేశంలో ఒక బీద బెస్తవాడుండేవాడు. వాడు పొద్దున్నే లేచి సముద్రపొడ్డుకుపోయి నాలుగు సార్లేవలవేసేవాడు. ఆ నాలుగుతూర్లకు యేవి దొరికితే అవి తీసుకుని బజారుకు పోయి అమ్ముకుని, ఆ వచ్చినడబ్బుతో పొట్టపోసుకుంటూఉండేవాడు. ఒక్కొక రోజున ఒక్క చేపైనా దొరికేదికాదు. అయినా వాడు "ఇవ్వాళ నాకు దేవు దేమీ యివ్వలేదు," అనుకుని తృప్తిగానే యింటికి వెళ్లేవాడు.

ఒకరోజున వాడు మామూలుగా సముద్రానికివచ్చి వల వేశాడు; మొదటి సారి వలలో వాడికి చచ్చినకుక్క వచ్చింది. రెండోసారి వేశాడు; ఎండ్రకాయలు పడ్డాయి. మూడోసారి వేశాడు; బొమ్మరాళ్లూ, నత్తగవ్వలూ వచ్చినై. నాలుగోసారి దేవుణ్ణి తలచుకుంటూ మళ్లీ వలవేశాడు; ఒక ఇత్తడి కూజా దొరికింది. వాడు అదిచూసి చాలా సంతోషించాడు. "ఇది అమ్ముకుంటే నూరుచేపల ఖరీదన్నా రాక పోతుందా?" అనుకున్నాడు.

కూజాకు మూతవేసి చుట్టూ తాడు కట్టివుంది. అది చూడగానే వాడికి ఒక ఆలోచనకూడా తట్టింది. ఈ కూజానిండా ఎవరైనా మొహరీలు పోసుకుని వుంచ కూడదా, అనుకున్నాడు. అనుకుని వాడు తాడు విప్పాడు. తాడు తీసివెయ్యగానే మూత దానంతటదే ఎగిరివచ్చింది. బెస్తవాడు ఆశతో కూజాలోకి చూశాడు. అతనికి దాంట్లో పొగతప్ప మరేమీ కనిపించలేదు. కాని, క్రమంగా అది బైటికి రా సాగింది. అది అట్లావచ్చి అట్లావచ్చి ఆకాశం ఎత్తుకు పోయింది. ఆ తర్వాత ఆ పొగంతా ఒక చోటకు చేరి పెద్ద భూతమైంది.

పాపం, బెస్తవాడు భూతాన్ని చూడగానే భయపడి, పారిపోదామనుకున్నాడు. కాని, భూతం పోనివ్వలేదు.

[అరేబియన్ నైట్సు కథ]



"ఓ! రాజా! నీ మాట యిక యెప్పుడూ వింటాను, రా!" అని.

బెస్తవాడికి ఆశ్చర్యం వేసింది. "ఎవర్ని నువ్వు పిల్చేది? నేను రాజను కాను," అన్నాడు.

"నువ్వు సాలమన్ రాజువుకాదా?" అని అడిగింది భూతం.

"ఉహుఁ, ఆ రాజు వెయ్యేళ్ల కిందటే చచ్చిపోయాడు. నేను బెస్తరాజుని."

ఈమాట విని భూతం ఆకాశం దద్దరిల్లేట్లుగా నవ్వి, "బెస్తరాజువా నువ్వు! ఐతే, వుండు. నిన్ను తినబోతున్నాను," అన్నది.

బెస్తవాడు గజగజ వణకుతూ, "నన్ను చంపుతావా? ఎందుకూ? నిన్ను ఈ కూజాలోనుంచి వదలిపెట్టినందుకా? నేను చేసినమేలుకు యిదేనా నువ్వుచేసే సహాయం?" అన్నాడు.

"ఆఁ! ఇదే. నిన్ను తినక తప్పదు. అయితే నీ వెట్లానూ చావబోతున్నావు కాబట్టి ఒకవరం కోరుకో. నీకు ఆ వరం యిస్తాను."

"అయితే నీ కథ తెలుసుకోవాలని వుంది, చెప్పు." అన్నాడు బెస్తవాడు.

"విను, చెప్తాను—పూర్వం నేను మంచిభూతాన్ని. సాలమన్‌రాజు నన్ను పొగగా మార్చి ఈ కూజాలో బంధించాడు. బంధించి నన్ను తీసుకెళ్లి సముద్రంలో పారేయించాడు. నేను అప్పుడు ఎవరైనావచ్చి నన్ను ఈ కూజాలోనించి వదిలిపెడితే వాడికి పెద్ద సహాయం చేద్దామనుకున్నాను చాలాకాలం. ఎవ్వరూ రాలేదు. ఇక నాకు కోపం వచ్చింది. ఈ మాటు ఎవరైనా వచ్చి నన్ను వదిలిపెడితే వాడినిచంపుదా మను కున్నాను. నువ్వు వచ్చి వదిలించావు. నిన్ను నేను చంపక తప్పదు."

ఇక భూతాన్ని బ్రతిమాలినా లాభంలేదు, అను కున్నాడు బెస్తవాడు. వాడికి హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. "ఓ భూతమా! నీమాటలు నేను నమ్మ లేకుండా వున్నాను. అంతా అబద్ధంగా తోస్తున్నది. ఇంతపెద్ద భూతానివి ఈ కాస్త కూజాలో వున్నావంటే ఎట్లా నమ్మేది? నా కళ్లతో చూస్తేగాని నేను నమ్మ లేను." అన్నాడు బెస్తవాడు.

ఈ మాటు భూతం మోసపోయింది. "అలాగా, నన్ను నమ్మలేవా? ఐతే వుండు చూపిస్తాను," అని ఆ భూతం మళ్లీ పొగగా మారి కూజాలోకి పోయింది. పోయి, "యిప్పుడు నమ్ముతావా నామాట?" అని అడిగింది.

"కాసేపు ఆగు. సరిగా చూడనివ్వు నన్ను" అని బెస్తవాడు గబుక్కున కూజాకు మూతపెట్టి తాడుతో గట్టిగా బిగించి పారవేశాడు.

లోపలనుంచి భూతం లబలబలాడ మొదలెట్టింది —"ఓ బెస్తరాజా! నన్ను వొదిలిపెట్టు. నిన్నిక చంపను. నీ కెంతో ధన మిస్తాను."

"నేను నీ మాట నమ్మను," అన్నాడు బెస్తరాజు.

"బేతాళుడితోడు. నిన్ను ఏమీచెయ్యను. నన్ను వొదిలిపెట్టు, అని బ్రతిమాలింది భూతం.

బెస్తవాడు వదిలి పెట్టాడు. భూతం ఆ



కూజాలోంచి మళ్లీ బయటికివచ్చి కూజాను ఒక్క తన్ను తన్నింది. కూజా ఎక్కడో సముద్రం మధ్యనపోయి పడింది. అప్పుడు భూతం బెస్తరాజుతో అన్నది: "నీ వల తీసుకుని నా అరిచేతిలోకి యెక్కికూర్చో. నిన్ను మంచి చోటుకు తీసుకుపోయి వదిలిపెడతాను."

బెస్తవాడు అలాగే అరిచేతిలోకెక్కి కూర్చున్నాడు. భూతం అతన్ని తీసుకుని ఆకాశంలోకి ఎగిరింది. కొండలూ, నదులూ, అడవులూ ఎన్నో దాటి ఆఖరుకు ఒక లోయ దగ్గరకి వచ్చి దిగింది. అక్కడ ఒక మంచి చెరువుంది. నీళ్లు అద్దంలాగా తెల్లగా వున్నై. భూతం బెస్తవాడితో, "నువ్వు రోజూ యిక్కడ ఒక్కసారి వల వేసుకో. నాలుగు చేపలు పడతై. అవి తీసుకెళ్లి పక్కరాజుకు అమ్ముకో. అతను నీకు బోలెడు డబ్బిస్తాడు. నీకిక దరిద్రంఉండదు," అన్నది. తర్వాత భూతం నేలను ఒక్క తన్ను తన్నింది.

భూమి రెండుగా బ్రద్దలైంది. భూతం దాంట్లోకి పోయింది. భూమి మళ్లీ మూసుకుంది.

ఆ బెస్తవాడు రోజూ అక్కడకొచ్చి వల వేసేవాడు. నాలుగు రంగుల్లో నాలుగు చక్కటి చేపలు పడేవి. అవి తీసుకెళ్లి పక్కనున్న రాజు కిచ్చేవాడు. ఆరాజు వాటికి 400 మొహరీలు యిచ్చేవాడు. పల్లెవాడి దరిద్రం తీరింది. హాయిగా భార్యతో బిడ్డల్తో బ్రతుకుతున్నాడు.

# పండిత జీ

"పండిత జవహర్‌లాల్‌కు జై, మహాత్మ గాంధీకి జై" అనిచాల సార్లు మీరు అనివుంటారు. లేదా కనీసం ఆ జేజేలన్నా విని ఉంటారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఎవరో మీకు తెలుసా?

నెహ్రూవంశంవారిది మొదట కాశ్మీర దేశం. వారి పూర్వులు సంయుక్త రాష్ట్రాలకు వచ్చి అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. జవహర్‌లాల్ తండ్రి మోతీలాల్ నెహ్రూ, తల్లి స్వరూపరాణి. మొదట్లో అంతగా ఉన్న కుంటుంబం కాకపోయినా, మోతీలాల్ నెహ్రూగారు న్యాయవాద వృత్తిలో సంపాదించి సంపన్నులయ్యారు. మన జవహర్‌లాల్ 1889 నవంబరు 14న జన్మించాడు.

మోతీలాల్‌గారిది విచిత్ర స్వభావం. వారికి అంతలోనే కోపం, అంతలోనే సంతోషం



మహా పురుషుల

జీవిత చరిత్ర

వచ్చేది. ఇంట్లో ఏమాత్రం పొరపాటు జరిగినా అగ్నిమై కూర్చునేవారు. జవహర్‌లాల్ కూడ తండ్రిదగ్గరకు వెళ్ళి మాట్లాడటానికి జంకేవాడు. తల్లిదగ్గిర మాత్రం ఆయనకు ఎంతో చనువు ఉండేది. తండ్రిగారు కోపపడినప్పుడు స్వరూపరాణి కొడుకుతరఫున వాదిస్తుండేది. జవహర్‌లాల్ అయిదేళ్ల వాడై ఉండగా ఒక చిన్నగమ్మత్తు జరిగింది. ఒక రోజున ఆయన తండ్రిగారి గదిలోకివెళ్లాడు. బల్లమీద రెండుఫౌంటెన్ కలాలు కనిపించాయి. వెంటనే ఆయనకు ఒక ఆలోచనకలిగింది. "ఎవరైనా ఒకేసారి రెండుచేతులతో వ్రాయరు. ఒక చేతితోవ్రాయటానికి ఒక కలం చాలు. నాన్నగారికి రెండు కలాలు దేనికి? నేను ఒక కలం తీసుకొంటే తప్పేముంది?" ఇలా అనుకుని ఆయన బల్లమీదనుంచి ఒక కలం తీసుకొని వెళ్లిపోయాడు.

మోతీలాల్‌గారువచ్చి చూచుకోగానే రెండోకలం కనిపించలేదు. పనిమనుషులందరిని పిలిపించారు. కేకలువేశారు. ఆ కలాన్ని తెచ్చి యివ్వకపోతే తిత్తి ఊడదీయిస్తానన్నారు. వెంటనే దానికోసం ఇల్లంతా వెతుకులాట ప్రారంభమైంది. జవహర్‌లాల్ తండ్రిగారిదగ్గరకు మెల్లగా వెళ్లి కలంఇచ్చాడు. ఆయన మండిపడి కొడుకును గట్టిగా చితకబొడిచాడు. ఆదెబ్బలకు తాళలేక బోరున యేడుస్తూ ఆయన తల్లిదగ్గరకు వెళ్లాడు. అన్ని దెబ్బలుతిన్నా ఆయనకు తండ్రిగారిమీద కోపంరాలేదు. "అమ్మా, నాన్నగారినేమీ అనకు. తప్పంతానాదే," అని తల్లి స్వరూపరాణితో అన్నాడు.

జవహర్ చిన్నప్పుడు ముబారక్ ఆలీగారివద్ద చదివాడు. ఆయనవద్ద చిత్ర విచిత్రాలైన అరేబియన్ కథలు విన్నాడు. వీటికి తోడు తల్లి భారతంలోనుంచి, రామాయణంలోనుంచి ఎన్నో



కథలు చెప్పింది. జవహర్‌లాల్‌కు తన పుట్టినరోజు పండుగ అంటే ఎంతో సరదా. ఆరోజున ఆయన్ను గోధుమలు మొదలైన ధాన్యాలతో తులాభారం తూచి వాటిని పేదసాదలకు పంచి పెట్టేవారు. కొత్త కొత్త దుస్తులు తొడిగేవారు. బంధువులు, స్నేహితులు వచ్చి ఎన్నో బహుమతు లిచ్చేవారు. అన్ని పనులు ముగిసినతరువాత మహా వైభవంగా విందుజరిగేది. ఇవన్నీ ఆయనకెంతో ఉత్సాహాన్ని రేకెత్తించేవి. "ఈ పండుగ ప్రతిరోజూ రాకూడదా? మధ్య మూడువందల అరవై నాలుగు రోజులు అడ్డు దేనికి," అనుకొనేవాడు.

జవహర్ తన పదకొండోఏట దివ్యజ్ఞానసమాజ మతస్థుడైన బ్రూక్స్‌వద్ద మూడేళ్ళు చదివి తరువాత మానాడు.

1905 లో, అంటే జవహర్ 15 వ యేట నెహ్రూ కుటుంబం ఇంగ్లండు వెళ్లింది. అప్పుడు ఆయన "హారో"లో విద్యాభ్యాసం కొనసాగించాడు. ఇక్కడ స్కూలులో చదువుతుండగా ఆయన తెలివితేటలకు మెచ్చుకొని, "గారిబాల్డీ జీవితం" బహుమతిగా ఇచ్చారు. ఈ పుస్తకం చదవగానే ఆయనకు దేశభక్తుల చరిత్రలు చదవాలన్న కుతూహలంకలిగి ఎన్నో చరిత్రలు చదివాడు. తరువాత ఆయనకు "హారో" స్థితిగతులు తన జ్ఞానవికాసానికి సరిపడవని తోచింది. అక్కడనుంచి మరొక స్కూలుకు మారటానికి తండ్రిగారి అనుమతి ఎలాగో సంపాదించి 1907 లో కేంబ్రిడ్జి ట్రినిటీ కాలేజీలో చేరాడు.

హారోలో మొలకలెత్తి ట్రినిటీలో ప్రబలమైన దేశభక్తి జవహర్ హృదయంలో తరువాత మహావృక్షమైంది. మనదేశానికి తిరిగి వచ్చినప్పటినుంచి దేశంకోసం ఆయన నిర్వహించని కార్యము, చేయని త్యాగము లేదు.

ఈనాడు ఆయన ఇండియా అధినివేశానికి ప్రధాన మంత్రి, ఇరవై ఐదు కోట్ల ప్రజలకు ఆయన నాయకుడు.






నక్క బావ నెత్తురు గడ్డలో యిరుక్కుపోయిందని చెప్పానుగదూ? పాపం అలాగే రెండు పగళ్లు రెండు రాత్రిళ్లు కదల మెదలకుండా వుండిపోయింది. గాయాలు నాక్కోటానికైనా మెడ కదిలించలేదు. ఎందుకంటే, మెడ జూలు నిండా నెత్తురు గడ్డకట్టుకుపోయింది. మంగలివాణ్ని ఎన్ని తిట్టిందో చెప్పలేం. మంగలిని ఎలా వంచించాలా అని ఎత్తులు మీద ఎత్తులు వేస్తూ వుండిపోయింది.

మూడోనాడు పెద్ద వానజల్లు పడింది. ఆ వానకు నెత్తురంతా తడిసి నక్క కదలటానికి వీలైంది. కాని, మూడురోజులు అలాగే కూర్చుని వుండటంవల్ల నరాలు పట్టుకుపోయి నాలుగు కాళ్లమీద నిలబడలేక పోయింది. కాసేపటికి ఎలాగో నిలవదొక్కుకుని దగ్గరున్న చెట్లల్లోకి పోయి యేవో ఆకులు మేసింది. దానికి అదే మందు. మీకు తెలుసునా! జంతువులకు జబ్బుచేస్తే అడివిలో ఆకులు మేస్తవి.

సరే, నక్క బావ మందుతిన్నది. బాగానే వుంది. కాని దానికి తిండి ఎట్లా? అదీగాక మూడు రోజుల్నించి కటికి వుపవాసమయ్యె. పోయి కోడిపిల్లల్ని బాతుపిల్లల్ని వేటాడటానికైనా వొంట్లో వోపికలేదయ్యె! ఎట్లాగా అని ఆలోచిస్తోంది ఆ చెట్టుకింద. దానికి మంగలివాడి ఆవు జ్ఞాపకం వచ్చింది. దగ్గర్లోనేవుంది వాని యిల్లు. దాన్ని ఎట్లాగన్నా చంపిస్తే హాయిగా పదిరోజులు తినొచ్చు.

యిట్లా ఆలోచిస్తూవుండగా అదో వస తోడేళ్ల దంపతులు వచ్చినై. నక్కకు వొక వుపాయం తట్టింది. మొగతోడేల్ని పిల్చి "ఇదుగో, తోడేలుమామా. మీకు ఆవు దొరికితే చంపుతారా" అని అడిగింది. "ఊఁ" అన్నవి తోడేళ్లు. "అయితే మీ

రిక్కడే వుండండి" అని చెప్పి నక్కబావ మెల్లిగా మంగలివాడి కొట్టంలోకి పోయింది. అప్పటికి బాగా చీకటిపడింది. మంగలి యింట్లో అన్నం తింటున్నాడు. కొట్టంలో ఎవ్వరూలేరు. మెల్లిగా ఆవుతాడు కొరికి, దొడ్డిదోవనే ఆవుని తీసుకొచ్చింది. తోడేళ్లు ఆవుకోసం చెట్టువెనకాల దాక్కనివున్నై. ఆవుని చూడగానే వెనకాలగావచ్చి పైన బడి చంపిపారవేసినై.

ఈలోపల మంగలి అన్నంతిని, ఆవుకు మేతవేసిపోదామని కొట్టంలోకి వచ్చాడు. ఆవులేదు. పాపం గాభరాపడి యిరుగు పొరుగువాళ్లని పిల్చి కాగడాలూ, నూనె బుడ్లూ చేతబట్టుకుని వెతుక్కుంటూ తోడేళ్ల దగ్గిరికి వచ్చారు. తోడేళ్లు మనుష్యుల్ని చూడగానే పారిపోయినై. నక్క బావ అంతకుముందే వాళ్లనిచూచి గుబురులో దాక్కున్నాడు.

చచ్చిపోయిన ఆవును చూసేసరికి పాపం మంగలికి ఏడుపువచ్చింది. ఏంజేస్తాడూ? ఇంటికొచ్చి పెళ్ళాంతో తోడేళ్లే ఈపని చేసినయ్యని చెప్పాడు. నక్కబావ మీద వాళ్లకి కాస్తకూడా అనుమానం పోలేదు.

మర్నాడు ఉదయాన్నే తోలైనా అమ్ముకుందామని మంగలి మాదిగవాళ్లతో పోయి చెప్పాడు. మాదిగవాళ్లు "మా కిప్పుడు చేలల్లో పనులున్నై తీరికలే"దని చెప్పారు.

పాపం మంగలి ఏంజేస్తాడు? ఆవును అలాగే వొదిలిపెట్టి వూరుకున్నాడు.



ఈ లోపల. నక్క బావ ఏంజేశాడూ! ఆవుకడుపుకు బెజ్జంపెట్టి రోజూ రాత్రిళ్లొచ్చి తినటం మొదలుపెట్టేడు. మూడురోజులైం తర్వాత కడుపుబాగా ఖాళీఅయింది. నక్క బావ మళ్లీ అక్కడి కిక్కడికి తిరగట మెందుకని పగలంతాకూడా ఆవు కడుపులోనే ఉండి ఆకలైనప్పుడల్లా తినటం మొదలు పెట్టాడు. ఇట్లా నాలుగురోజులయ్యేసరికి మాంసం అయిపోయింది. ఇక నక్కబావ బయటికి పోదామనుకున్నాడు. కాని ఆవుతోలు ఎంతకి ఎండి బెజ్జం బాగా బిగుసుకుపోయింది. పాపం నక్క బావ ఏంచేస్తుంది? కొరికి బైటికిరావాలని చూసిందిగాని, ఊహుఁ దానితరంగాలేదు.

"అయ్యో! మళ్ళీ దీంట్లో చిక్కుకున్నా నేమిరా దేవుడా!" అని విచారించింది నక్కబావ. ఏమిలాభం, ఇప్పుడెన్ని అనుకున్నా?

ఇలా యింకో రెండురోజులు గడిచినై. వొకరోజున మాదిగవాళ్లాదోవన వస్తూ ఎండుకుపోయిన ఆవుని చూసి దీన్ని యింటికి లాక్కుపోయి తోలు వొల్చుకుంటే బాగుంటుం దనుకున్నారు. అనుకుని





కొమ్ములు పట్టుకుని యీడ్చుకు పోబోయారు. నక్కకి యిది చూసేసరికి పై ప్రాణాలు పైనేపోయినై. కాని దానికి చప్పున వొక వుపాయంతోచింది. "ఎవర్రా మీరు? మీకు మదమెక్కిందా? నే నెవర్ననుకున్నారు? ఈవూరు గ్రామదేవతను. నాకు కోపం తెప్పిస్తారా? మీ వూరు నాశనం చెయ్యబోతున్నాను. రేపు సాయంత్రం లోపల నూరుబిందెల నీళ్లతోనూ, వొక కోడిపుంజుతోనూ వొచ్చి, నీళ్లతో నన్ను అభిషేకంచేసి కోడిపుంజును నాకు బలి యివ్వకపోతే మీవూరుకు గత్తరతెస్తాను." అని బిగ్గరగా అరిచింది నక్కబావ.

పాపం యీ మాటలు వినేసరికి దూడగాళ్లకి భయంవేసింది. వాళ్లు ఆవుని వొదిలి వూళ్లోకి పరిగెత్తి మునసబుతోనూ కరణాలతోను యీ సంగతి చెప్పారు. వాళ్లందరూ ఆవుదగ్గిరికి వచ్చి దేవరకి దణ్ణంపెట్టి "అమ్మా, తల్లీ, గంగానమ్మా, మాపల్ల తప్పేందమ్మా" అని అడిగారు.

"మీవల్లగాదు. మీ మంగలివాడివల్ల. వాడు ఆవును చంపాడు. ఆ పాపమంతా మీ వూరికి చుట్టుకుంది. మీరుపోయి వాడినీ వాడి పెళ్లాన్నీ పంపి యిందాక నే చెప్పిన పూజలు చేయించండి. మీ బోలిక

రాను. లేకపోతే మీ ఊరు సర్వనాశనం చేస్తాను." అన్నది నక్కబావ.

అప్పుడు మునసబు, కరణం, వూళ్లో వాళ్లూ అంతా మంగలి యింటికిపోయి "ఇదంతా నీతప్పేనట. ఈపూజ ఖర్చంతా నువ్వే పెట్టుకోవాలి" అని చెప్పారు. పాపం మంగళ్లి ఏంజేస్తాడు? నూరు ఖిండెల నీళ్లూ, పళ్లూ, పత్రీ, పెద్ద కోడి పుంజూ తీసుకుని తప్పెట్లూ, తాళాలూ, గణాచార్లతో పూజచెయ్యటానికి మొగుడూ, పెళ్లాలు ఆవుదగ్గిరికి వచ్చారు. కోడిని కాళ్లుగట్టి ఆవుముందు పడేసి నూరు ఖిండెల నీళ్లూ ఆవుమీద పోసి, మంగలి, మంగలివాడి పెళ్లాం ఆవుముందు ప్రాణా చారం బడ్డారు.

అప్పటికి ఆవుతోలు బాగామెత్తబడింది. కంత మళ్ళీ పెద్దదైంది. నక్క వొక్క ఊపున ఆవు కడుపులోంచి బైటకిదూకి కోడిపుంజును నోట కరుచుకుని వొకటే పరుగు.

పాపం నక్క తంతు తెలియగానే, మంగలిమీద వూళ్లోవాళ్లకి జాలివేసింది. తలాకాస్తా డబ్బిచ్చి యింకో ఆవును కొనుక్కోమన్నారు.

నక్కబావ ఇవాళ బాగా హుషారుగా వున్నాడు. వారంరోజుల్నుంచీ ఆవుమాంసం దొరకటంవల్ల కొంచెం పుంజుకున్నాడు. పైగా యివ్వాళ కోడిపుంజు దొరికింది. మళ్ళీ మామూలు బరిలోకిపోయి పడుకుని "మంగలీ! జాగ్రత్త!! నిన్ను యింతటితో వదుల్తా ననుకున్నావేంటి?" అని బెదిరించింది.

పాపం మంగలక్కడ లేడుగా వింటానికి! హాయిగా యింట్లో పడుకుని నిద్ర పోతున్నాడు. చూద్దాం. ఈమాటు నక్క మళ్ళీ ఏమిచేస్తుందో.



# చీమ - చిలుక - పాయసం

అనగా అనగా ఒక చీమా ఒక చిలకా ఉండే వారు. వాళ్ళిద్దరికీ ఎంతో సావాసం. ఒకనాడు వాళ్ళిద్దరికీ పాయసం వండుకు తినాలని బుద్ధిపుట్టింది. చీమ పోయి బియ్యపు నూకలూ, పంచదారా తెచ్చింది. చిలక పోయి కట్టెపుల్లలూ, చట్టీ, నిప్పూ తెచ్చింది. చీమ నిప్పు అంటించింది. చిలక పొయ్యి ఊదింది. పాయసం తయారయింది.

అయితే చీమకి మహా తొందర. అది గబగబా చట్టిఎక్కి పాయసం తిన బోయి అందులోపడి చచ్చి పోయింది. చిలకకూడా ఆత్రపడి పాయసంలో ముక్కుముంచింది. ఇంకేం ముక్కు చుర్రున కాలింది. అది కుర్రో మొర్రోమని ముక్కు విదిలించుకుంటూ రావిచెట్టుమీదికి పోయి కూచుంది.

రావిచెట్టు చిలకనుచూసి కొంచెం గేలిగా "చిలకా, చిలకా! ఏం, విచారంగా ఉన్నావు?" అని అడిగింది.



చిలకకు కొంచెం విసుగేసి "ఏమీలేదు. చీమా నేనూ పాయసం వండుకున్నాము. చీమ పాయసం లోపడి చచ్చింది. నాకు ముక్కు కాలింది. ఇంత పోకిళ్లు పోతున్న నీ ఆకులు రాలిపోకూడదూ!" అంది.

ఆమాట అనగానే రావి చెట్టు ఆకులు జలజలా, రాలిపోయాయి.

ఇంతలో ఒక ఏనిగ ఆ దారినిపోతూ చెట్టునుచూసి నవ్వువచ్చి "చెట్టూ, చెట్టూ! నీ ఆకులు రాలిపోయాయేం? ఎండాకాలం కాదుగా?" అన్నది.

కె. పద్మమణి పట్నాయక్, విశాఖపట్నం.



"ఏమీ లేదు. చీమా చిలకా పాయసం వండుకున్నాయట. చీమ అందులోపడి చచ్చిపోయింది; చిలకకి ముక్కుకాలింది; వెక్కిరించిన నాకు ఆకులు రాలిపోయాయి. ఇంత నవ్వుగా ఉన్న నీకు తొండం కూడా ఊడిపోకూడదూ?" అన్నది రావిచెట్టు.

ఏనిగతొండం ఊడిపోయింది. పాపం అది ఏడుస్తూ చెరువు దగ్గరికి పోయి కూచుంది. చెరువుకు తొండంలేని ఏనిగని చూసేవరకు నవ్వాగలేదు.

"ఏం, ఏనిగా ఏనిగా! ఇవ్వాళ నీళ్లతాగటంలేదేం? తొండం ఎక్కడ పెట్టి వచ్చావు?" అంది.

"ఎక్కడా పెట్టలేదు. చీమా చిలకా పాయసం వండుకున్నాయట. చీమ పాయసంలోపడి చచ్చిపోయింది; చిలకకి ముక్కుకాలింది; చిలకని వెక్కిరించిన రావిచెట్టుకు ఆకులు రాలాయి; అదిచూసినవ్విన నాకు తొండం ఊడింది. నన్ను చూపి వెటకారం చేస్తున్న నీ నీళ్లకూడా ఎండిపోగూడదూ?' అన్నది యేనిగ.

అనగానే చెరువులోనీళ్లు ఎండిపోయాయి. ఇంతలో తోడికోడళ్లు ఇద్దరు చెరువుకు నీళ్ళకు వచ్చారు. నీళ్లు లేకపోవడం చూసేవరకు వాళ్ళకు నవ్వు వచ్చింది. "ఏం, చెరువూ చెరువూ! ఇలా ఎండిపోయావేం?" అని అడిగారు.

"ఏమీలేదు. చీమా చిలకా పాయసం వండుకున్నాయట. చీమ పాయసంలోపడి చచ్చింది. చిల



కకి ముక్కు కాలింది. చిలకని వెక్కిరించిన రావి చెట్టుకు ఆకులు రాలాయి. అదిచూసి నవ్విన ఏనిగకు తొండం వూడింది. ఏనిగని చూసి వెటకారంచేసిననాకు నీళ్లెండి పోయాయి. నన్ను చూసి పగలబడుతున్న మీ బిందెలు అలాగే అంటుకు

పోతే ఎంత బాగుణ్ణు!" అన్నది చెరువు.

అనగానే బిందెలు అంటుకు పోయాయి. ఇంతలో ఇంకొక మనిషి కావిడితో నీళ్ళకువచ్చి చెరువులో నీళ్ల లేకపోవటమూ, బిందెలు



అంటుకు పోవటమూచూసి పాపం, అతను మంచిగానే "ఏమమ్మా! బిందెలు అట్లా అంటుకున్నాయెందుకూ?" అని తెలుసుకోవటానికి అడిగాడు.

"ఏమీ లేదు. చీమా చిలకా పాయసం వండుకున్నాయట. చీమ పాయసంలోపడి చచ్చింది. చిలకకి ముక్కు కాలింది. చిలకని వెక్కిరించిన రావిచెట్టుకు ఆకులు రాలాయి. రావిచెట్టునుచూసి నవ్విన ఏనిగకు తొండం వూడింది. ఏనిగనిచూసి వెటకారం చేసిన చెరువుకు నీళ్లెండిపోయాయి. చెరువునిచూసి పగలబడ్డ మాకు బిందెలు అంటుకుపోయాయి. ఇక మమ్మల్ని వోదార్చటానికి వచ్చిన నీకు కావిడి అంటుకు పోకూడదూ?" అన్నారు, వాళ్లు కడుపుమంట పట్టలేక.



అయితే ఈమాట అనీ అనకముందే ఆమనిషి కావిడి కిందపారవేశాడు. కావిడి కిందపడటంతోటే వాళ్ల బుజాలమీది బిందెలు వూడిపోయినై. చెరువుకు నీళ్ళువచ్చినై. ఏనిగకు తొండం వచ్చింది. చెట్టుకు ఆకులువచ్చినై. చిలక ముక్కు బాగయింది. చీమ బతికింది.

అందరూ ఆనందంతో ఆరోజు పాయసంతాగారు.



## మీకు తెలుసా ?



జరాఫీకి మెడ అంతపొడుగు ఎందుకు ఉన్నది ? అది ఏమితింటుంది ?



పాముకు చెవులున్నవా ?

●

మీకు తెలిస్తే వ్రాయండి :
లేకపోతే వచ్చేసంచికలో జవాబులు చూడండి.

## చిక్కు మాట

●

అబ్బాయిలూ, అమ్మాయిలూ !
నేను నాలుగక్షరాల దేవుణ్ణి.
నేను చంచాలో వున్నా గాని
గరిటలో లేను
దవనంలో వున్నాగాని
మరువంలో లేను
మాసంలో వున్నాగాని
సంవత్సరంలో లేను
భామలో వున్నాగాని
భానులో లేను
నే నెవరో చెప్పగలరా ?

పి. లలిత, పెదరావూరు

జవాబు 57 వ పేజీలో చూడండి.

### చందమామ పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 స | 2 ది | | 3 త | ల | |
| 4 ఊ | | 5 న | గ | లు | | 6 ఢో |
| 7 ధా | 8 ర | ము | | 9 పు | 10 ట | లు |
| | స | | | | క్క | |
| 11 య | ము | 12 నా | | 13 పి | రి | 14 కి |
| తి | | 15 వ | రు | డు | | లి |
| | 16 క | ల | | 17 గు | డి | |

# నేటి పాపలు రేపటి పౌరులు



అప్పచ్చులు దొరకని
చి॥ 'పాపచ్చు' (మాంబళం)



అతిరూప లావణ్య చి॥ 'లావణ్య'
(తాడేపల్లి గూడెం)



నిత్యానంద మోహనుడు
చి॥ జె. మోహన్ (బెజవాడ)



లోకకల్యాణానికి ప్రార్థిస్తున్న
చి॥ కల్యాణి (గుంటూరు.)

# తేనెటీగల సహాయం

పూర్వం ఒకప్పుడు జావా దేశాన్ని యోగదత్తుడనే రాజు పరిపాలించేవాడు. అతనికి సుమతి అనే చక్కటి చుక్కలాంటి కూతురుండేది. ఆపిల్ల అందం దేశదేశాల్లో పేరు మోగిపోయింది. ఎంతోమంది రాజకుమారులు ఆపిల్లను పెళ్లిచేసుకోవాలని చూస్తుండేవాళ్లు. వాళ్లల్లో సింహళదేశపు రాజకొమారుడు సింహకేతు ఒకడు. అతను పెద్ద సైన్యాన్ని పోగుచేసి పెద్దపెద్ద ఓడలలో జావా దేశంమీదికి దండెత్తాడు.

యోగదత్తుడికి యీ సంగతి తెలిసింది. అతని మంత్రులు, సామంతులు యుద్ధం చేసి సింహకేతును జావాలో కాలుపెట్టకుండానే పారదోలదామన్నారు. కాని, యోగదత్తుడు ఒప్పుకోలేదు - "రాజులు యుద్ధం చెయ్యటం ప్రజలకు మంచిది కాదు. ఏరాజు ఓడిపోయినా నష్టపడేది ప్రజలే. కాబట్టి అతన్నే యీ ప్రజల్ని ఏలనిద్దాం. నాకేమీ అభ్యంతరంలేదు. నేను నా భార్యను పిల్లను తీసుకుని అడివిలోకిపోయి వుంటాను" అన్నాడు.

యోగదత్తుడు అడవికి వెళ్లిపోయాడు. మంత్రులు, సామంతులు, ప్రజలు అతనితో కూడా అడివికి వెళ్లారు. సింహకేతు జావాలో దిగాడు. అక్కడ అతనికి ఒక్క నరమానవుడు కనిపించలేదు. అతను నిరుత్సాహపడ్డాడు. యోగదత్తు డెక్కడ వున్నది అతనికి జాడ చెప్పేవాళ్లేలేరు.

యోగదత్తుడు దట్టమైన అడవికిపోయి అక్కడ ఒక గుహలో భార్యా బిడ్డల్తో వుండసాగాడు.

ఓరోజు వుదయాన అతను తపస్సు చేసుకోటానికని బయలుదేరాడు. దోవలో తామరకొలను ఒకటివున్నది. అక్కడ ఒక తామర పువ్వుమీద సాలీడు వలపన్ని





వుంది. ఆ వలలో వొక తేనెటీగ చిక్కుకుని వున్నది. యోగదత్తుడికి జాలివేసి వొక పుల్లతో దాన్ని తప్పించాడు. ఆ తర్వాత మామూలు చోటుకుపోయి కూర్చుని తపస్సు చేసుకోటం మొదలు పెట్టాడు. అతనికి ఆవేళ దేవి ప్రత్యక్షమై "ఓ, రాజా! తేనెటీగకు నువ్వుచేసిన వుపకారం వూరికే పోదు. శత్రువునించి నిన్ను అవి కాపాడతాయి. చెట్ల మానులతో వొక కోట కట్టు. జావాదేశపు తేనెటీగలన్నీ వచ్చి దాంట్లో వుంటై" అని చెప్పి మాయమైంది.

యోగదత్తుడు అప్రకారంగానే కోట కట్టాడు. తేనెటీగలన్నీ వచ్చి అందులో వున్నై. అతని ప్రజలుకూడా ఆ కోటలోనే వున్నారు.

కొంత కాలానికి యోగదత్తుడు యిక్కడ వుంటున్న సంగతి సింహకేతుకు తెలిసింది. అతను రాజునుచంపి అతని కూతుర్ని యెత్తుకుపోదా మనుకుని పెద్ద సైన్యంతో వచ్చి కోట ముట్టడించాడు. కాని అతన్ని ఎవ్వరూ యెదిరించలేదు. సింహకేతు కొయ్య కోటను ధ్వంసంచేశాడు. యింకేం తేనెటీగలు వొక్కమాటుగా ఝుమ్మని లేచినై. సింహకేతును, అతని సైన్యాన్ని, గుఱ్ఱాల్ని చచ్చేటట్టు కుట్టినై. పాపం, సింహకేతు మొహంఅంతా వాచి కళ్లు కనపడక గుఱ్ఱంమీదనుంచి పడిపోయాడు. యోగదత్తుడు అతన్ని తన గుహలోకి తీసుకుపోయి గాయాలు మాన్పి తన కూతుర్నిచ్చి పెళ్లిచేశాడు. సింహకేతు బుద్ధి తెచ్చుకుని జావా ప్రజలను చక్కగా పరిపాలిస్తూ అక్కడే వుండిపోయాడు.



# చందమామ పజిల్

[భాషాభివృద్ధికి]

**అబ్బాయిలూ, అమ్మాయిలూ!**

మీరు పెద్దవాళ్ల సహాయం లేకుండా సొంతంగా ఆలోచించి ఈ పజిలు పూర్తి చేయాలి సుమా. అలా పూర్తిచేసి 52 పేజీలో ఉన్న జవాబుతో సరిచూసుకోండి. ఒక్క తప్పుకూడా లేకపోతే మీకు పది మార్కులు. ఒక తప్పుంటే ఆరు మార్కులు. రెండు తప్పులుంటే నాలుగు మార్కులు. మూడు తప్పులుంటే రెండుమార్కులు. నాలుగుగాని అతిక్రమించిగాని తప్పులుంటే మాత్రం బండిసున్నా వచ్చినట్లే,

పోతే, దీన్ని పూర్తిచేసేపద్ధతి మీకు తెలుసునా? 1 నెంబరు అడ్డంలో రెండు అక్షరాలు వుండాలి. ఆధారములలో "ప్రవహించువది" అని వుందా, దానికి రెండు అక్షరాల మాట ఏమైయ్యుండాలి అని ఆలోచించాలి. అప్పుడు "నది" వస్తుంది. అక్కడ 'నది' ఉంచండి.

అలాగే 2 నెంబరు నిలువు మూడు అక్షరాలు వుండాలి, దానిని వెతకటానికి 'రోజు' ఏదా అని చూడాలి. దాని మొదటి అక్షరం "ది" - యిది ఏమబ్బా అని ఆలోచిస్తే "దినము" గుర్తుకు వస్తుంది. అట్లాగే తతిమ్మాగళ్లూ పూర్తిచేసి మీమార్కులు నాకు చెప్పండి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ■ | 1 న | 2 ది | ■ | 3 | | ■ |
| 4 | ■ | 5 | గ | | ■ | 6 |
| 7 | 8 | | ■ | 9 | 10 | |
| ■ | స | ■ | ■ | ■ | క్ష | ■ |
| 11 | | 12 | ■ | 13 | | 14 |
| | ■ | 15 | రు | | ■ | |
| ■ | 16 | | ■ | 17 | | ■ |

## ఆధారములు

అడ్డము :

1. ప్రవహించునది.
2. శరీరములో ముఖ్యభాగము
5. అలంకారములు
7. సూదితో ఉండును
9. పుస్తకములో ఉండును
11. ఒక నది 13. ధైర్యములేనివాడు
15. పెండ్లికొడుకు
16. నిద్రలో వచ్చునది
17. దేవాలయము

నిలువు :

2. రోజు
3. ద్వారమునకు ఉండును
4. ఒక రంగు
6. వాయించునది 8. సారము
10. జిత్తులమారి 11. ముని
12. పెద్దకథ
13. గొప్ప వర్షమువచ్చినప్పుడు పడును.
14. తలలేని వాకిలి

---

52 వ పేజిలోని చిక్కుమాటకు జవాబు

'చందమామ'

---

58వ పేజిలోని పొడుపు కథలకు జవాబు

1. కత్తెర. 2. మద్దెల.

---

64 వ పేజీలో చిక్కు బొమ్మలకు జవాబు

పిల్లిపిల్ల కుక్కమూతిలోనే ఉంది. ఏనిగ మంత్రిగారి మొహంలో ఉంది.



ఈ చదరంమధ్యని రెండు మామిడి కాయలు ఉన్నాయి. దోవ మహాచిక్కుగా వుంది. ఉడత పకటి ఆ కాయలు తినాలని చూస్తోంది. చెప్పండి, ఎలా వెళ్లితే అడ్డు లేకుండా ఆ కాయల దగ్గరికి పోతుందో ?

---

## - ముగ్గు -



కాశీనాధుని శ్యామలదేవి, బెజవాడ.

## ఆంధ్రులం

హంపీక్షేత్రం మనదేనోయ్
అజంతా చిత్రాల్ మనవేనోయ్
గుణాఢ్యహాలులు మనవారోయ్
నాగార్జునుడును మనవాడోయ్
విద్యారణ్యులు పండితరాయలు
నాగేశభట్టు అన్నంభట్టూ
నాదబ్రహ్మ త్యాగరాయలూ
మొదలగు పెద్దలు మనవారోయ్
ఆంధ్రులమంటే మనమేనోయ్!

కృష్ణరావు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మ | మా | ద | ము | కు | ర | ద్రా |
| సు | ధాం | చం | ద | బా | క్క | ల |
| డు | శు | డు | వు | స్థ | చు | డు |
| శ | శ | ధ | డు | క | లు | ఱే |
| చే | డు | రు | శు | త్రే | వ | ల |
| లి | గు | జా | స | క్ష | ల | న్నె |
| వె | లు | బి | ల్లి | డు | ఱే | వె. |

పిల్లలూ! చందమామకు యెన్ని పేర్లున్నాయో మీకు తెలుసా? చుక్కవున్నగదిలో బయలుదేరి, చందమామ పేర్లన్నీ వరసగాచదువుకుంటూవెళ్లండి. దారి తప్పకూడదు సుమా. దారితప్పితే ఆ పేర్లు తెలియవు. మరి మొదలెట్టు.

కూర్పు: కె. శకుంతల, బందరు

## చిలకాపిట్ట!

చిలకాపిట్ట! చిలకాపిట్ట!
చెర్లో ఉన్నాది;
అత్తాతెచ్చిన కొత్తాకోక
కట్టా నన్నాది;
మామాతెచ్చిన మామిడుపూకలు
వండా నన్నాది;
మొగుడూతెచ్చిన మల్లేమొగ్గలు
ముడవానన్నాది;
మొగుడీచేత మొట్టికాయలు
తింటానన్నాది.

సంపాదన:
వింజమూరి వెంకటరత్నమ్మ

## పొడుపు కథలు

1

పాముపోలె రెండు వాడి నాలుకలుండు
కనుల వ్రేళ్లుపెట్ట కనలితేచు
ఔంతనుండువారి జీల్చుచుండుట వృత్తి
ఇందుభావమేమి చందమామ.

2

కాళ్లు చేయి లేదు కడుపు కొంచెముగాదు
కంట కూడుగుడుచుఁ గలువకంటి
అంటిన మొఱబెట్టు నదియేమి చోద్యమో
ఇందు భావమేమి చందమామ.

సంపాదన:
జక్కా నాగమునిచెట్టి, కడప.

జవాబు 57 వ పేజీలో




రామలింగం కాళికాదేవి వరంవల్ల గొప్ప కవి అయినాడు. కాని ఏమి లాభం? ఆరోజుల్లో అంత పెద్దకవులను ఆదరించగలవారు తెనాలి చుట్టుపక్కల లేరు. ఒక్క విజయనగరం మహా రాజు కృష్ణదేవరాయలు మాత్రం తెనుగు కవులను ఆదరిస్తూ ఉండేవారు. ఆ సంగతి తెలిసి రామలింగం ఎన్నో కష్టాలు పడి విజయనగరం చేరుకున్నాడు.

ఇన్ని ప్రయాసలుపడి చేరుకున్నా రాజుగారి దర్శనం దొరకటం సులభం కాదు; రాజు ఆస్థానంలో ప్రవేశించటం మాట అటువుంచి. రామలింగం ఆ ఊళ్ళో విచారిస్తే రాయలవారి గురువు గారైన తాతాచార్యుల వారిని పట్టుకుంటే రాజాస్థానంలో సులభంగా చేరవచ్చని చెప్పారు. రామలింగం ఆనాటినించీ తాతాచార్యులవారి సేవచేయడం మొదలు పెట్టాడు. ఇలా మూడుమాసాలు శ్రమ పడ్డాడు. ఆచార్యులవారి అనుగ్రహం కలగలేదు. "నీబోటి కుర్రాళ్ళ కి రాజుగారి దర్శనమేమిటీ! నీ కవిత్వం వారికి వినిపించట మేమిటీ?" అని నవ్వాడు.

ఆఖరికి రామలింగానికి విసుగుపుట్టి ఒకనాడు ఆస్థానం బంట్రోతుకు లంచ మిస్తానని చెప్పి దర్బారులో ప్రవే శించాడు. అప్పుడు దర్బారులో పెద్ద వేదాంతచర్చ జరుగుతున్నది. ఒక పండితుడు ఈ ప్రపంచమంతా మిథ్య అనీ, మనంచూచేది అంతా కల్పితమనీ చెప్పుతున్నాడు. సభలోవారంతా ఆశ్చ ర్యంతో నోర్లుతెరుచుకు వింటున్నారు. ఆయన ఉపన్యాసం చాలించి కూర్చో గానే రామలింగం లేచి - "స్వామీ! మనమిప్పుడు చేస్తున్నవన్నీ చేస్తున్నా మని అనుకోవటమేకదా?" అని అడి గాడు. ఆయన - "అవును, అంతే" అన్నాడు.



"అయితే స్వామీ! మహారాజుగారిప్పుడు మనకు భోజనాలు పెట్టిస్తారు కదా. మీరు తినకుండా మానుకోండి. ఈ ప్రపంచం మిథ్య కాదనుకునే మాబోటివాళ్ళం కొంతమందిమి భోం చేస్తాము." అన్నాడు రామలింగం.

సభలోవాళ్ళంతా గొల్లున నవ్వారు. పాపం ఆ వేదాంతి చిన్నబోయాడు. రాయలువారు రామలింగం సమయస్ఫూర్తికి మెచ్చుకుని ఆస్థానంలో చోటిచ్చారు.

రామలింగం కోరిక నెరవేరింది. ఇక తాతాచార్యులవారి పని ఎట్లాపట్టాలా అని ఆలోచించ మొదలుపెట్టాడు.

తాతాచార్యుల వారికి తెల్లవారుఝామునేలేచి తుంగభద్ర నదికిపోయి స్నానంచేయటం అలవాటు. ఈసంగతి రామలింగం తెలుసుకుని ఒకరోజున తాతాచార్యులవారు స్నానంచేస్తుండగా గుడ్డలుతీసి దాచాడు. ఆచార్యులవారు స్నానంచేసి బయటికివచ్చి చూసుకుంటే గుడ్డలులేవు. రామలింగం అప్పుడే ఏమీ తెలియనివాడిలాగా ఒకవేపునించి వచ్చి ఆచార్యులవారిని పలకరించాడు. రామలింగాన్ని చూసేవరకు ఆచార్యులవారి పైప్రాణాలు పైనేపోయినవి. ఇది రామలింగం పనేనని గ్రహించి బ్రతిమాలటం మొదలుపెట్టాడు. రామలింగం చాలాసేపు బ్రతిమాలించుకుని ఆఖరికి ఒకషర్తుమీద గుడ్డలుఇవ్వటానికి ఒప్పుకున్నాడు. అదేమిటంటే- తాతాచార్యులవారు రామలింగాన్ని ఊళ్లోదాకా మొయ్యాలి!

ఏంచేస్తాడూ పాపం ఆచార్యులవారు, విధిలేక ఒప్పుకున్నాడు. అప్పటికి తూర్పు బాగా తెల్లవారింది. రామలింగాన్ని భుజాలమీద ఎక్కించుకుని ఊళ్లోకివచ్చిపడదామని పరుగుతీయటం మొదలుపెట్టాడు.

అప్పటికి ఊళ్లోవాళ్లంతా లేచారు. తాతాచార్యులవారు రామలింగాన్ని భుజాలమీద ఎక్కించుకుని పరుగెత్తుకు రావడం అంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు. రాయలవారుకూడా లేచి మేడపైకివచ్చి చూశారు. వారికి గుంపులుగా చేరినజనమూ, తాతాచార్యులవారు రామలింగాన్ని మోయటమూ కనిపించింది. వారికి చాలాకోపంవచ్చింది! బంట్రోతులనుపిలిచి –"మీరుపోయి ఆ పైనఎక్కికూచున్నవాణ్ణి దించి తన్నుకుంటూ తీసుకు"రమ్మని ఆజ్ఞాపించారు.



రాయలవారు బంట్రోతులు ఇకవచ్చి తన్ను పట్టుకుంటారని అనుకున్నాడు రామలింగం. అతనికి వెంటనే ఒకఉపాయంతట్టింది. తాతాచార్యులవారిమీదినించి దిగి–"స్వామీ! మీచేత నేను తెలియక మోయించుకోవటంవల్ల నాకెంతో పాపం చుట్టుకుంది. మళ్ళీ మిమ్మల్ని నేను మోస్తేతప్ప ఆపాపంపోదు. దయఉంచి నామీద ఎక్కికూచోండి. మోస్తాను." అని బ్రతిమాలాడు.

పాపం ఆచార్యులవారు ఇది నమ్మి రామలింగంమీద ఎక్కి కూచున్నారు. కాస్తదూరం పోయారో లేదో రాజుగారి బంట్రోతులువచ్చి తాతాచార్యులవారిని రామలింగం మీదినించి లాగి బాదుకుంటూ, బాదుకుంటూ రాయలవారి దగ్గరికి తీసుకెళ్లారు. నేను రాజుగారి గురువుగార్ని అని యెంత మొత్తుకున్నా వాళ్లు వినలేదు.

రాయలవారికి గురువుగారి అగచాట్లు చూసేవరకు మరీ కోపంవచ్చింది. రామలింగాన్ని పట్టుకుపోయి, గోతిలో పాతిపెట్టి ఏనిగలచేత తొక్కించమని ఆజ్ఞాపించారు. ఈవిధంగా తాతాచార్యులవారి కడుపుమంట చల్లారింది.

రామలింగం చావకుండాతప్పించుకోగలడా? వచ్చేసారి చదవండి!




మా పార్వతమ్మ అత్తయ్యగారి శారదవుందే ఖలే కూఖి. పిల్లలం యెంత నవ్వుకుంటున్నా అది నవ్వదు. రెండు డొక్కల్లో చక్కిలిగిలి పెట్టికూడా చూశాం. ఉహుం. కాని, అది పైకి యెంత మంచిదానిలా కనిపిస్తుంతో లోపల అంత దొంగముచ్చు.

అది చేసిన చిలిపిపనులు చెప్పాలంటే శానా వున్నై. నేను వక్కటిమాత్రం చెపుతున్నాను.

వొకసారి యేమైందీ - వొక పండక్కు శాదదావాళ్ల యింటికి వాళ్ల బావ వచ్చాడు. శారద, బావ చెప్పిన పనులన్నీ యివ్వీ చేస్తూ ఆయన్ని కనిపెట్టుకునే తిరిగింది. బావగారు భోం చేస్తుంటే ఆయనకిమంచినీళ్లూ ఆవీ అందించింది భోజనంచేసిలేచి చెయ్యి కడుక్కోటానికి పో తూంటే 'బావగారూ, నేను చెంబు తెస్తానుం డండీ. మీకెందుకు శ్రమ' అని చేతిలో చెంబు బలవంతాన తీసు కుని 'ఇక్కడకాదు, ఇంకొంచం అవతల' అంటూ పెరటి చివ రికి తీసుకెళ్లింది. అక్కడ 'చెయ్యిచాపం'డని కాసిని నీళ్లు పోసింది. ఆయన ఆనీళ్లు నోట్లో పోసుకుని మూతి తుడుచు కున్నాడు. మూతి ఎంగిలి అలాగే వుంది. మళ్లీ ఆయన చెయ్యిచాపాడు. శారద యేమి చేసిందీ- నీళ్ళు పొయ్యబోయి నట్లు చెంబుయెత్తి కిందకు వదలిపెట్టింది. అంతలోనే చెంబు కిందపడి నీళ్లన్నీ పోయినై.



'పాడు చెంబు, నేతి జిడ్డున్నట్టుంది జారి కిందబడింది. మీరు కొంచెం ఆగండి బావగారూ, నేను యింట్లోకిపోయి పరుగెత్తుకుంటూ నీళ్లు తెస్తాను' అని తుర్రున యింట్లోకి పోయి కూర్చుంది. పాపం, శారద బావగారు చాలాసేపు నిలువుగాళ్ల జీతం పుచ్చుకొన్నాడు. 'ఏది శారద అంటే ఏది శారద' అనుకొన్నాడు. అటూ చూచాడు ఇటుచూచాడు. శారదవస్తేగా. చివరికి వాకిట్లోకొచ్చి శారదని పిల్చాడు. ఉలకలేదు పలకలేదు.

శారద ఇంట్లో మంచం మీద పడు కుని కడుపునొప్పని మూల్గుతోంది. శారద అక్కయ్యవచ్చి ఆయనకి నీ ళ్లిచ్చింది. తర్వాత 'ఏమే, నీళ్లు ఎందుకు తీసుకెళ్లి ఇవ్వలేదు?' అని అడిగితే, 'నేను ఎత్తు కెళ్దామనే అనుకున్నాను అక్కా. కాని నాకు కడుపు నొప్పి వచ్చి కదలలేక పోయాను' అన్నది. ఏమిచేస్తారు దాన్ని

బావ ఎంత జాగ్రత్తగా వున్నా రెండురోజుల కొక సారైనా దానిచేతిలో మోస పోతూనే ఉంటాడు.

రచన: వి. రాజ్యలక్ష్మి, శికిందరాబాద్.

# కొంటెరాముడు

చీమకుర్తి సత్యం, మద్రాసు.

మన చందమామపుట్టి సరిగా వక నెలైనా కాక ముందే మాఇంట్లో భలే గమ్మత్తు జరిగింది. మా యింట్లోవాండ్ల అబ్బాయి రాముడు వయసులో చిన్నవాడైనా కొంటెతనం లోమాత్రంపెద్ద. అందుకే వాడిని అందరు కొంటె రాముడు అంటారు. వాండ్ల అవ్వ 70 ఏండ్ల ముస లామె. మనవాడికి ఆమె పొడఅంటే గిట్టనే గిట్టదు. ఓప్రక్కనుండి వేడి వేడివి వీపున మాడు తున్నా ఆమెను ఆటలు పట్టించడం మానడు.

'చందమామ' మనవాడిచేతిలో పడ్డంతోటే దాంట్లోవుండే పద్యాలు పాటలన్నీ చదవడం ప్రారంభించాడు. అందులోని "వొకటి వొకటి రెండు, అవ్వబోడి గుండు" అనే పాటని చూడ్డం తోటే వక్కగంతేసి వాళ్ళ అవ్వదగ్గరజేరి "వొకటి వొకటి రెండు, అవ్వబోడి గుం"డంటూ గంతు లేయడం ప్రారంభించాడు. అవ్వకు కోపమాగింది గాదు. వాండ్ల నాన్నతో చెబుతానని బెదిరించింది. పట్టుకొని కొట్టాలని ప్రయత్నించింది. కాని వాడు చేతికి చిక్కలేదు. గంతులు, కేకలు పెద్దవి జేశాడు. అవ్వ ఎట్లాగైనా వీడిపని పట్టాలను కుంది.

అవ్వ ఆలోచించి ఆలోచించి రాముడి పొగ రణచడానికి చిన్నదారి బట్టింది. రాముడికి వక పంతులమ్మ ప్రయివేటు చెబుతుంది. ఆమె ప్రతి రోజూ సాయంత్రం చక్కగా అలంకరించుకొని తెల్లటి చీర గట్టుకొని, చిన్న గొడుగు పట్టుకొని, చెప్పులేసుకొని యింటికి వచ్చి పాఠంచెప్పి వెళ్లేది. ఆమెనుచూస్తే రాముడికి యమదూతనుచూచినట్టే.

వొకరోజున ఆమె రావడంతోటే పుస్తకాలు తెచ్చుకోవడానికి పిల్లివలె మిద్దెపైకి వెళ్ళాడు మన రాముడు. సమయం దొరికిందనుకొంటూ అవ్వ నెమ్మదిగా పంతులమ్మదగ్గర జేరి "ఏమండీ! మావాడికి మీరంటేగూడ భయంలేదే! యింటిలో చదవనే చదవడు. ఎప్పుడూ అల్లరిజేస్తుంటాడు. అదీగాకుండా ఎవరో చెప్పారని ఎప్పుడూ వీధిలో కూర్చుని, చిన్నపెద్ద అనిగూడ చూడకుండా "రెండు రెండు నాల్గు, పంతులమ్మ సీల్గు" అని పాడుతుంటాడు. వాడి పాటనుచూచి అందరూ నవ్వుతుంటారుగూడా" అని చల్లగా అంటిం చింది. పంతులమ్మకు యెక్కడలేని కోప మొచ్చింది. మన రాముడు పుస్తకాలు తీసుకొని వచ్చి సరిగా కూచోకముందే బెత్తంతో ఉతకడం మొదలుపెట్టింది. రాముడు 'అమ్మో! బాబో!' అంటూ గంతులువేయడం మొదలుపెట్టాడు. అవ్వ చాటుననుండి తనలో తాను నవ్వుకుంటూ 'భలే చందమామ' అంటూ నిలుచుకొన్నది. పంతులమ్మ బెత్తం విరిగేదాకా కసితీర్చుకుంది. అంతటితో మన రాముడి తుత్తరకూడా అణి గింది. అవ్వ పంతమూ చెల్లింది.

చూడండి చందమామ యెంతపనిచేసిందో!

---

దొంగముచ్చు (పోటీవ్యాసం) మొదటి బహుమానం వి. రాజ్యలక్ష్మి, సికిందరా బాదుకు ఇచ్చాము. రెండోబహుమానం చీమకుర్తి సత్యం, మద్రాసుకు ఇచ్చాం. ఈనెల పోటీవ్యాసం 'కల్పనా కథ.' జంతువుల కథైనా, మనుషుల కథైనా, దెయ్యాల కథైనా సరే ఒకటి మీరు పేజీకి మించకుండా కల్పించి రాసిపంపాలి. బాగున్నవాటికి 1-వ బహుమానం 10-0-0, 2-వ బహుమానం 5-0-0 ఇస్తాము. రాసి పంపుతారు కదూ?



## బొమ్మల్లో బొమ్మలు

ఇందులో మహానుభావుడు మంత్రి సత్తముడు. ఈయనగారు దర్బారుకు వెళ్లుదామని ఏనిగకోసం చూస్తున్నారు. అది కనపడలేదు. పోనీ ఆ ఏనిగ కంటో నలుసన్నా కాదు కనపడకుండా ఉంటానికి. పాపం, మీకు ఏనిగ కనబడితే మంత్రిగారితో చెప్పండి.

మీకు తెలియకపోతే 57 వ పేజీ చూడండి.

ఇందులో కుక్క ఉన్నది చూశారూ? పిల్లిపిల్ల వెంట పడింది. ఆ పిల్లిపిల్ల కుక్కను తిప్పితిప్పి చటుక్కున వొక చోట దాక్కుంది. ఆ పిల్లి పిల్ల ఎక్కడ ఉందో కనుక్కొని కుక్కకు చెప్పగలరా?

కనుక్కోలేకపోతే
57 వ పేజిలో జవాబు చూడండి.



Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editor : CHAKRAPANI.



*Chandamama* *Photo — N. Ramakrishna*

ఊప్పుప్పు గోనె

PRINTED AT THE B. N. K. PRESS, MADRAS - 1